# శ్రీ శివమహిమ్నస్తోత్రం




(పుష్పదంత విరచితము)

## 21

క్రియాదక్షోదక్షః క్రతుపతిరధీశస్తనుభృతాం
ఋషీణా మార్త్విజ్యం శరణద సదస్యాః సురగణాః।
క్రతుభ్రేష స్త్వత్తః క్రతుఫల విధానవ్యసనినో
ధ్రువం కర్తుః శ్రద్ధా - విధురమభిచారాయహి మఖాః ॥

ఓయి శరణాగతరక్షకా! యజ్ఞమూర్తి వైన నీయందు భక్తిలేక నిర్వహింపబడిన యజ్ఞము యజ్ఞకర్తకే హాని కలిగించును కదా! దక్షత్వము కలిగిన ప్రజాపతియై దక్షుడు యజ్ఞమునకు పూనుకొనెను. ఆయనకు ఋత్విక్కులుగా మహర్షులే వచ్చిరి; దేవతలు సదస్యులైరి. యజ్ఞ ఫలప్రదాతవైన నీయందు భక్తిలేని దక్షుని యజ్ఞము ధ్వంసమైనది.

# బాలమిత్ర

పిల్లల మాసపత్రిక

సంపాదకుడు : బి. వి. రాధాకృష్ణ

సంపుటి 32] * ఏప్రిల్ 1976 * [సంచిక 5


## పదండి ముందుకు
## పోదాం పై పైకి!!

మన ప్రధాన మంత్రి దేశంలో స్థిరమైన క్రమశిక్షణను కల్పించి, ఇరవై సూత్రాల పథకంతో నూతన పురోభివృద్ధికి పుష్ఠమైన నిర్మాణం చేశారు. ఇరవై సూత్రాల అమలుకు సంబంధించి చిన్న చిన్న కథలుగా 'బాల రచయితలు' ఏవైనా రచనలు పంపిస్తే 'బాలమిత్ర' ప్రమోదంతో ప్రకటిస్తుంది

— సంపాదకుడు

# కేసరి చింత

ఒక సింహం ఎప్పుడు చూసినా ఏదో చింతతో వుంటూ సదా జుపిటర్ దేవతతో ఇలా మొరపెట్టుకొనేది : "జుపిటర్ ప్రభూ! నాకు అంగసంపద, బలసంపద, అందచదాల్చి యిచ్చావు. వీరకేసరి బిరుదాంకితుడనైన నాకు కోడిపుంజు కూత విన్నంతనే ప్రాణాలు పోయేటట్టుగా, నవనాడులు కృంగేటట్టుగా వుంది, ఎక్కడలేని భీతి ఆవహిస్తోంది నాలో. ఈలోపల నాకు పెద్ద శాపంగా తోస్తోంది." అని.

పదే పదే మొరపెట్టుకుంటున్న సింహానికి ఒకనాడు ప్రత్యక్షమైన జుపిటర్ దేవత "సింహరాజమా! నా అంత బలసంపదలు నీ కిచ్చాను. మృగాలన్నిటికీ రాజును చేశాను. అయితే, ప్రతి జీవికి పెట్టినట్లే నీకూ కోడికూత అనే ఒక భీతిని పెట్టాను. అంతమాత్రానికే వగవనేల, ధైర్యంగా వుండు!" అని ధైర్యంచెప్పి అంతర్ధాన మయ్యాడు.

జుపిటర్ దేవత ఎంత చెప్పినా మనసు వూరటచెందని సింహం, హృదయ భారంతో అడవిలోపడి పోసాగింది. దారిలో ఒక ఏనుగు నిలబడి వుండటం చూసి, దాని దగ్గరికి వెళ్ళి తన కొరతను చెప్పుకుంది - ఏదన్నా మార్గం చెబుతుందేమోనని. వెళ్ళిన సింహానికి ఏనుగు వూరక చెవులు అదేపనిగా ఆడించటం ఆశ్చర్యాన్ని కలిగించి, "ఏనుగు బావా! ఎందు కలా వూరక చెవులు ఆడిస్తున్నావు?" అని అడిగింది.

"నా భయం, దిగులు ఏం చెప్పను బాబూ! నా చెవుల్లో చీమదూరినా, ఈగదూరినా అమాంతంగా నాప్రాణం కొస్తాపోతుంది. అందుకే జీవితాంతం నాకీ చెవులు ఆడించుకునే బాధ!" అని చెప్పి ఏనుగు వాపోయింది. ఏనుగు మాటలు విన్న సింహానికి మనసు వూరట కలిగింది. అంత పెద్ద ఏనుగే అల్ప చీమకు, ఈగకు జడిసి అనుక్షణం భయపడుతూ జీవిస్తుంటే, ఎప్పుడో, ఎక్కడో వినివించే కోడికూతకు కాస్సేపు చలిస్తేమాత్రమేం?" అనుకుని సింహం హృదయ భారం తగ్గించుకొని ఉత్సాహంగా అక్కడినుంచి వెళ్ళి పోయింది.

---

దగ్గుపాటి మౌలాలి, దగ్గుబాడు.



# తగిన శిక్ష

పూర్వమొక నగరంలో బుచామియా అనే సుందర యువకు డుండేవాడు. అతడు చాల మంచివాడు. ధనవంతుని బిడ్డ. ఔదార్యం, దయాగుణం కలిగిన సజ్జనుడు. అతని తల్లి దండ్రులు గతించగా స్వతంత్రంగా, స్వేచ్ఛగా జీవిస్తున్నాడు. ఒకనా డతడు నగరంలో రాజ వీధి గుండా పోతుండగా ఒక విపరీత దృశ్యం కన్పించింది.

ఒక అందమైన సుందరాంగిని, ముదుసలి యైన ఆమె తండ్రిని చేతులకు సంకెళ్ళు వేసి రాజభటులు బందీలుగా తీసుకుపోతున్నారు. వాళ్లు మొరటుగా ఆ సుందరిని లాక్కు పోతుంటే, జనం విరగబడి చూస్తున్నారు. బుచామియా కది చూడరాని దృశ్యమైంది. అందమైన యువతిని రాజవీధిలో అవమా నించడం చూడలేక పోయా డతడు. గబగబా రాజభటుల దగ్గరకు పరుగెత్తుకొని వెళ్లి, వాళ్ల నాయకునితో ఆ సుందరాంగిని, ఆమె తండ్రిని అవిధంగా హింస చెయ్యడానికి కారణమేమి టని ప్రశ్నించాడు.

అతడు ఇలా చెప్పాడు :

'ఆ సుందరి తండ్రి ఒక షావుకారికి ముప్ఫయి వేల దీనారాలు బాకీపడ్డాడు. అందుచేత అతని ఆస్తి అంతా జప్తుచేసి, అతనిని, అతని కుమార్తెను కూడా చెరలో వెయ్యమని న్యాయాధిపతి ఆజ్ఞ అయింది. అందుచేత ఆ సుందరిని, ఆమె తండ్రిని చెరసాలకు తీసుకు పోతున్నాము."

ఆ మాటలు వినగానే బుచామియాకు వారి మీద దయకలిగింది. వెంటనే న్యాయా ధిపతి దగ్గరకు వెళ్లి, ఆ సుందరి తండ్రి ఇవ్వ వలసిన ముప్ఫయివేల దీనారాలు తాను చెల్లించి, ఆమెను, ఆమె తండ్రిని చెరనుండి విడిపించాడు. తండ్రి ఆమె బుచామియాపై కృతజ్ఞులైనారు. అతనిని వారింటికి ఆహ్వా నించారు. బుచామియాకు ఆ సుందరిని చూడగా హృదయం వశం తప్పింది. ఆమె అద్భుతమైన సౌందర్యం కలిగినది. పైగా అతని యందు మిక్కిలి కృతజ్ఞతతో వినయ గౌరవాల్ని చూపిస్తున్న యువతి. అతని హృద యంలోని భావాలను ఆ సుందరి గ్రహి-




చింది. అతడు మహాధనవంతుడు; యౌవనంలో ఉన్నవాడు; సుందరుడు కూడా. ఆమె హృదయం కూడా ప్రతిధ్వనులనిచ్చింది. అన్యోన్యం ప్రేమ తెలుపుకున్నారు వాళ్లు. ఆమె తండ్రితో తమ ప్రేమవృత్తాంతాన్ని చెప్పాం. అతడు సంతోషంతో వాళ్లకు పెళ్లిచేశాడు.

బుచామియా తన భార్యను ఇంటికి తీసుకు వచ్చి సుఖంగా కాలం గడుపసాగాడు. ఇట్లా కొన్ని సంవత్సరాలు సుఖంగా గడిచాయి బుచామియాకు ఒక చిన్న దురలవాటు ఉన్నది- అది వేటకు పోవడం. అతనికి వేటకు వెళ్లడమంటే అమిత సరదా. ఆ వేటకు వెళ్లడంలో అతనికి స్నేహితులున్నారు. అందులో ఒక స్నేహితుడున్నాడతనికి. ఆ స్నేహితుడు ఆ ఊరి రాజుగారి తమ్ముడు. ఈరాజసోదరుడు బుచామియాతో కలసి వేటకు వెళ్లాడు వేటలో. దొరికిన జంతుజాలంలో పాలుపంచుకోవడం ఉన్నది అప్పుడప్పుడు బుచామియా ఇంటికి వచ్చి ఆతిథ్యాన్ని కూడా స్వీకరిస్తూ ఉండగా, ఒక త్రుటికాలం బుచామియా భార్యను చూడటం తటస్థించింది.

ఆమె సౌందర్యం అతని కంటపడగానే అతనికి వెర్రులెత్తినవి. ఏమీ తోచలేదు. హృదయం వశం తప్పిపోయింది. ఇంటికి వెళ్లి ఎట్లాగైనా బుచామియా భార్యను తన స్వాధీనం చేసుకోవాలని ఆలోచనలు చేశాడు. రాజుగారి తమ్ముడు కదా! కావలసినంత ధనం ఉన్నది, కోరినంత మంది సేవకులున్నారు.

అంతఃపురంలో దాసీలకు నాయకురాలొకతె మిక్కిలి చాకచక్యం కలది ఉన్నది. దానిని పిలిపించి రాజసోదరుడు ఆలోచన చేశాడు. ఆమె ప్రయత్నించి, బుచామియా భార్యను వశపరచుకుని అతని గృహానికి తీసుకు రాగలనని ఆశ కల్పించింది. ఆ ప్రయత్నం ఫలించడానికి ఎంత ధనం కావలసినా తీసుకోమన్నాడతడు. ఆమె మరునాడే గ్రామస్త్రీ వేషంవేసుకుని బుచామియా ఇంటికి వచ్చి, అతని భార్యతో పరిచయం కల్పించుకుంది.

తరువాత ప్రతిదినం వస్తూ ఉండటం సాగించింది. వచ్చినప్పుడల్లా అనేకు పురూపమైన బహుమానాలు తెచ్చి యిస్తూ, ఆమె దగ్గర కొంత నమ్మకం కలిగించుకొన్నది. తరువాత తన చాకచక్యాన్ని ఉపయోగించి, ఆ సుందరాంగి మనస్సులో అవినీతి బీజాలు నాటింది. రాజసోదరునిపై ప్రీతి కలిగేటట్టు

వేసింది. బుచామియా వేటకు వెళ్లినప్పుడు రాజసోదరుడు ముసుగు వేసుకుని ఘోషాస్త్రీ లాగా బుచామియా ఇంటికి వచ్చి అతని భార్యతో సుఖించడం ప్రారంభమైంది. అతని భార్య ఇక బుచామియా ఇంటిలో ఉండటం లేనికనుకున్నది. రాజుగారి సోదరుని ఇంటికే వెళ్లిపోదా మనుకున్న దా కృతఘ్నురాలు. అందుకోసం ఆమె రాజసోదరునితో కలసి పెద్ద పన్నాగం పన్నింది.

ఒకనాటి అర్ధరాత్రి బుచామియా అనుమానం లేకుండా నిద్రపోతున్నాడు. ఆమె మెల్లిగా లేచి దొడ్డికలుపు దగ్గరకు వచ్చి వేచి ఉన్నది. ఆమె ప్రియుడు రెండు గుర్రాలతో అక్కడకు రాగానే చిన్న ఈల వేశాడు. ఆమె తలుపు తీసింది. ఇంటిలో ఉన్న బంగారం - ధనం - నగలు - విలువగల వజ్రాలు - రత్నాలు - అన్నీ తీసుకుని వాళ్లు గుర్రాల మీద వెళ్లి పోతూ, ఇంటికి నాలుగు ప్రక్కలా-ఇంటి మధ్యలోనూ నిప్పు అంటించి ప్రజ్వలింపజేశారు. వాళ్లు దూరంగా వేరొక నగరానికి వెళ్లి పోయి, తాము తెచ్చుకున్న ధనంతో భార్యాభర్తల లాగా సుఖంగా కాలక్షేపం చెయ్యసాగారు.

మండుతున్న మంటల మూలంగా బుచామియా నిద్రాభంగమై లేచాడు. భార్య కన్పించలేదు. అప్పటికే ఇల్లు చాలా భాగం దహించి పోయింది. భార్య కోసం వెతికాడు. తెల్లవారే దాకా ఇంటి చుట్టూ పరిభ్రమిస్తూనే ఉన్నాడు. ఇరుగు పొరుగువాళ్లు చేరారు. తెల్లవారింది. ఇల్లు బూడిద రాశిగా ఉన్నది. తన భార్య అందులో మరణించి ఉంటుందని భావిం



చాడు - బుచామియా. తన కున్న సర్వస్వం దగ్ధమై పోయిం దనుకున్నాడు. ఆ బూడిద రాశిని చూచి చాలసేపు దుఃఖపడ్డాడు. ఇరుగు పొరుగువాళ్లు ఓదార్చా రతనిని.

మంటలలో దగ్ధమైపోతే ఎముకలన్నా తన భార్యవి కన్పిస్తాయని బూడిద రాశి అంతా వెతికాడు, కన్పించలేదు. అతనికి ఆశ్చర్యం వేసింది; అనుమానం కలిగింది. తన మిత్రుడు రాజసోదరుడు కొన్నాళ్లుగా తనతో వేటకు రాకపోవడం మొదలైన సందర్భాలను బట్టి అతడే తన భార్యను బలవంతంగా ఎత్తుకొని పోయి ఉంటాడనీ, తన భార్య ఏమీ చేయలేక వెళ్లి ఉంటుందనీ అనుకున్నాడు. ఏమైనా సరే వాళ్లను వెదకి పట్టుకోవా లనుకున్నాడు.

చింపిరి గుడ్డలు కట్టుకుని, ఒంటి నిండా బూడిద పూసుకుని, జుట్టు విరబోసుకుని, నెమలి ఈకల కట్ట పట్టుకుని బిచ్చగాడుగా

మొత్తుకుంటూ తిరిగాడు. అయితే, తన దుస్తుల్లో పదునైన తన చేతి కత్తి మాత్రం దాచుకొని ఉంచుకున్నాడు ఇట్లా అనేక గ్రామాలు, పట్టణాలు తన భార్య కోసం, తన కృతఘ్నుడైన మిత్రుని కోసం వెతికాడు. చివరకు వాళ్లు ఉన్న ఊరు వచ్చాడు. ఆ యింట్లోకి తన పూర్వ మిత్రుడు వెళ్లడం చూచాడతను. అందుచేత అక్కడనే నిలచి ఉన్నాడు. బయటకు వచ్చిన దాసీదాని మూలంగా లోపల ఒక స్త్రీ కూడా ఉన్నదని తెలుసుకున్నాడు ఆమె చేసిన వర్ణనను బట్టి లోపల ఉన్న ఆమె తన భార్య అని గ్రహించాడు.

అంతా తన భార్య తనపై అభిమానంతోనే ఉన్నదనీ పరిస్థితుల బలవంతం వలన తన్ను వదలిపెట్టి వెళ్లిందనీ అనుకుంటున్నాడతడు. అందుచేత ఆ దాసీదానిని పిలిచి, ఆమె చిన్న సహాయం చెయ్యమన్నాడు ఆమె సరే నన్నది తాను వచ్చి వాకిట్లో వేచి ఉన్నట్లు తన భార్యతో చెప్పమన్నాడు. దాసీది అట్లాగే చేసింది. లోపల వాళ్లిద్దరూ ఇష్టాగోష్ఠి కబుర్లు చెప్పుతుంటూ, మద్యము త్రాగుతూ ఉండగా, దాసీది వెళ్లి ఆమె చెవ్వలో చెప్పింది. ఆమె భయ భ్రాంతురాలై లేచి, కిటికీ లోంచి బయటకు చూచి, బయట ఉన్న భర్తను గుర్తు పట్టింది. వెంటనే తన ప్రియునికి అంతా చెప్పి, ప్రమాదం నుంచి తప్పించుకుందామని చెప్పింది.

వెంటినే నౌకర్లతో అతడు రెండు గుఱ్ఱాలు తెప్పించాడు. ఇంట్లో ఉన్న బంగారు, ధనం, ఆభరణాలు, రత్నాలు మూట కట్టుకుని దొడ్డి త్రోవ దగ్గర ఉన్న గుఱ్ఱాల దగ్గరకు చేరారు-వాళ్లిద్దరు. ముందు వాకిట్లో వేచి ఉన్న బుచా



మియాకు ఏదో అనుమానం వేసింది. ఇంటి వెనుక ప్రక్క చూదామని అటుప్రక్కకు వచ్చాడు. అప్పటికి అతడు గుఱ్ఱాన్ని ఎక్కి ఉన్నాడు. ధనం మూట ఉన్న గుఱ్ఱం మీద ఆమె ఎక్కబోతున్నది; సేవకుడు సహాయం చేస్తున్నాడు. బుచామియా అకస్మాత్తుగా సేవకుని మీద పడి వాడిని కత్తితో పొడిచాడు. ఆమె ఎక్కబోతున్న గుఱ్ఱాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఈ హడావుడిలో ద్రోహియైన అతడు మాత్రం గుఱ్ఱమెక్కి ఉన్నాడు కాబట్టి ఉడాయించాడు.

బుచామియా తన భార్యను, ధనం మూటను, ఆమె ఎక్కబోతున్న గుఱ్ఱాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఇంకా ఆమె మీద అతనికి పూర్తిగా క్రోధం రాలేదు. ఆమెను తన ఊరు తీసుకువచ్చి తండ్రికి అప్పగిద్దామనుకున్నాడు. ఆమెను తీసుకుని తన ఊరుకి ప్రయాణం సాగించాడు. ప్రయాణం మజిలీలు మజిలీలుగా సాగించి. గుఱ్ఱము మీద నెక్కి పారిపోయిన ద్రోహి కూడా అవకాశం దొరికితే దెబ్బ తీద్దామని అతని వెనుకనే ప్రయాణం సాగిస్తూ వచ్చాడు.

ఒకనాటి మిట్టమధ్యాహ్నం ఎండ ఎక్కువగా ఉండగా ఒక పెద్ద చెట్టు నీడను బుచామియా మజిలీ చేశాడు గుఱ్ఱాన్ని చెట్టుకి కట్టివేశాడు. ఒక పెద్ద చాపవేసి నేలమీద తాను పడుకున్నాడు. అతని భార్య కూడా అక్కడనే విశ్రాంతి తీసుకుంటూ ఉన్నది. బుచామియా నిద్రిస్తుండగా ఆ ద్రోహి అక్కడకు వచ్చాడు. ఆమె మేలుకొనే ఉన్నది కదా! ఇద్దరు మాటాడుకున్నారు. అతడు బుచామియాను కత్తితో పొడిచి చంపుతా నన్నాడు ఆమె 'వద్దు, వీడికి అంత కంటే పెద్ద శిక్ష వెయ్యాలి. ముందు త్రాళ్లతో బంధించు''



అన్నది. అతడు బుచామియాను త్రాళ్లతో బిగించి లేవతీసి చెట్టుకు కట్టాడు. బుచామియా నిద్రమేల్కొని పరిస్థితులు గ్రహించి, భగవంతుడు తన కీవిధంగా వ్యతిరేక స్థితులు ఎందుకు కల్పించుతున్నాడో నని బాధ పడుతూ ఉన్నాడు.

ఆ టక్కులాడి తన ప్రియుడితో సరసాలాడి, మద్యాన్ని సేవించి బుచామియాతో "ఓరి నిర్భాగ్యుడా!" అని దూషణలు పలుకుతూ అతని ఎదురుగానే ప్రియునితో సుఖించడం సాగించి, "ఇదే నీకి ముందు శిక్ష" అన్నది. తరువాత వాళ్లిద్దరూ మళ్లీ మద్యాన్ని త్రాగి సొమ్మసిల్లి పడుకున్నారు. అప్పుడు చెట్టు తొఱ్ఱలోనుంచి ఒక పెద్ద త్రాచు పాము బయటకు వచ్చి చెట్టుకి కట్టబడి ఉన్న బుచామియా శరీరం చుట్టూ చుట్టు కున్నది. బుచామియా భయంతో తల్లడిల్లి పోతూ భగవంతుణ్ణి ప్రార్థించాడు. అంతలో ఆ పాము ద్రోహి శిరస్సు పైకి పోయింది కాటు వేసింది. అతడు నిద్రలోనే మరణించాడు

ఆ ప్రక్కనే ఉన్న మద్యం పాత్రలో పాము విషం కక్కి మళ్లీ చెట్టునెక్కి తన తొఱ్ఱలోకి వెళ్లిపోయింది. ఇదంతా చెట్టుకి కట్టబడి ఉన్న బుచామియా చూస్తూనే ఉన్నాడు. ఇంతలో ఆమె నిద్రలేచింది. మద్యం పాత్రలో కొంచెం మద్యం పోసుకు త్రాగింది తరువాత తన ప్రియుణ్ణి నిద్రలేప సాగింది. అతడు లేవలేదు. కొంత సేపటి కతడు చచ్చిపోయాడని తెలుసుకుంది. బుచామియా పైన క్రోధం పెంచుకుని అతడిని పొడిచి చంపుదామని కత్తి తీసుకుని అతనిని సమీపించింది. ఆమె త్రాగిన విషం ఆమె తల కెక్కి నురుగులు క్రక్కుకుంటూ చచ్చిపోయింది.

ఇంతలో ఆ ప్రక్కగా ఒక బాటసారుల గుంపు వచ్చింది వాళ్లు వచ్చి చెట్టుకు కట్టబడిన బుచామియా కట్లను ఊడతీశారు. బుచామియా జరిగిన కథ అంతా వాళ్లకు చెప్పాడు. వాళ్ళు చచ్చిపోయిన ఇద్దరి శవాలను అక్కడనే పూడ్చిపెట్టి, బుచామియాను తన మూటలతో అతని ఊరుకు తీసుకు వెళ్ళారు.






ఒక మహాసుందరుడైన యువకు డుండేవాడు. అతడు చాలా బాగా జానపద నాట్యం చేసేవాడు; చక్కగా మృదంగం వాయించేవాడు. అతడు గంటల కొద్దీ అలసటలేకుండా నాట్యంచేస్తే, జనం పరవశులైపోయేవాళ్ళు. అతడు నాట్యం మొదలుపెట్టితే, యువతీమణులంతా చుట్టూచేరి, అతనితోపాటు నృత్యం చేసేవాళ్ళు. అతని అందాన్ని, నాట్య చాతుర్యాన్ని, మృదంగ వాద్య నైపుణ్యాన్ని మెచ్చుకోని యువకులు ఆ పరిసర గ్రామాలలో లేరు. అతనిని ప్రేమించి పెండ్లి చేసుకోవాలని ఎంతమందో యువతులు ప్రయత్నిస్తూ ఉండేవారు.

అతడు సూర్యాస్తమయంతో నాట్యం ప్రారంభించి, తెల్లవారేలోగా ఏడుగ్రామాలకు వెళ్లి, అక్కడ నృత్యంచేసి, ప్రొద్దు పొడిచేటప్పటికి ఇంటికి తిరిగి వచ్చేవాడు. మొదట అక్రా గ్రామానికి వెళ్లి మృదంగం మ్రోగించేవాడు. యువతీమణులు "అతడు వచ్చాడు పదండి! నృత్యం చేద్దాము" అంటూ గుంపులుగా వచ్చి నృత్యం ప్రారంభించేవాళ్లు. వాళ్లు సుందరమైన వస్త్రాభరణాలతో, పూలు దురిమిన కేశసంపదతో వచ్చి, పరవశులై పాడుతూ, ఆడేవారు వాళ్లు తమ్ము తాము మరచి గానం చేస్తూ ఉండగా, అతడు తప్పుకొని పరుగుల మీద ప్రక్క గ్రామానికి చేరేవాడు. అక్కడ కూడా అట్లాగే చేసేవాడు. యువతీమణులు చక్కగా అలంకరించుకొని, పూలుపెట్టుకుని, కేశములలో దువ్వెనలు పెట్టుకొని నృత్యం చేసేవాళ్లు. వెంట్రుకలు ఆడుతుంటే చెదిరిపోతే దువ్వి సవరించుకోవడాని కని యువతులు నృత్యంచేసేటప్పుడు కొప్పులలో దువ్వెనల్ని గ్రుచ్చుకోవడం ఆటవిక సంప్రదాయం. అతని నృత్యానికి, మృదంగ వాద్యానికి, పాటకు నిజంగా ఆడపిల్లలకు పిచ్చియెత్తిపోయేది. అతడు ఏడు గ్రామాలలో అట్లాగే చేసి,తిరిగి తెల్లవారుతుండగా ఇల్లు చేరేవాడు. అతడు వెళ్లే ఆఖరి గ్రామం కోయిలనదికి అవతల ప్రక్కగా ఉన్నది.

ఆ నదిమీదే ఆటవికులు బౌహానియా తీగలతో వంతెనకట్టారు. ఒకనాడు నాట్య

గాడు ఆరు గ్రామాలలో నృత్యం ముగించి, ఏడవ గ్రామానికి వెళ్ళడానికి కోయిల నది మీద ఉన్న తీగల వంతెన దాటుతున్నాడు అనాడు అతనికి పరవశత్వం అధికంగా ఉంది. తీగల వంతెన మీద కూడా నాట్య భంగిమలో నడవడం సాగించాడు. అలా నడుస్తుండగా అతని సంతోషము ఎక్కువైంది. అందువలన అతను వంతెన మీద నడుస్తూ వుండేది మరచిపోయాడు. ఏడవ గ్రామంలో యువతీమణుల ముందు నాట్యం చేస్తున్నట్టుగా భావించి, వంతెనపై, అటూ ఇటూ వేగంగా నాట్యం చేయసాగాడు. నాట్యం చేసేటప్పుడు అతని కాలు తీగల మీదపడి, అతను నదీ జలంలో పడ్డాడు. అప్పటికిగానీ అతను వంతెన మీద నడుస్తూ వుండేది జ్ఞాపకం రాలేదు అతడు. నదీ జలంలో పడి మునిగిపోయాడు.

ఆ రాత్రికి కోయిలనదికి అవల ప్రక్కన ఉన్న గ్రామానికి అతడు చేరకపోయేటప్పటికి ఆ గ్రామంలో యువతీమణులు, నాట్యప్రియులు ఆందోళనపడ్డారు. తమ గ్రామానికి ఎందుకురాలేదని కనిపించిన వారందరినీ ప్రశ్నించడం ప్రారంభించారు. ఊరంతా కలసి అతనికోసం అన్వేషణ సాగించారు. కోయిలనది గట్టుకి చేరారు. నదిలో తీగల వంతెన క్రింద నీళ్లలో తాళ్లను పట్టుకొని అతని మద్దెల వేలాడుతున్నది. అతడు అక్కడ నీళ్లలో పడిపోయి వుంటాడని జనం భావించి వలలు వేశారు.

అతని శవందొరికింది. ఆ వార్త మిగిలిన గ్రామాలకు ప్రాకింది. అతనితో నృత్యం చేసే యువతీమణులు, నాట్యప్రియులు - అంతా వచ్చారు. అంతా దుఃఖించారు. వాళ్లు నృత్యం చేసేటప్పుడు ధరిస్తున్న దువ్వెనలను అతని యందు తమకున్న గౌరవానికి చిహ్నంగా అతని పాదాలదగ్గర వెయ్యగా పెద్దకుప్ప అయింది. ఆ కుప్పతోనే అతనికి దహనం జరిగింది. ఆ ఏడు గ్రామాలలోని స్త్రీలు అప్పటినుండి మళ్ళీ నృత్యం చేసేటప్పుడు దువ్వెనలు పెట్టుకోవడం మానుకున్నారు - అతన్ని మరచిపోలేక.






# బొమ్మలరాణి

విజయపురి అనే గ్రామంలో ఓ ముసలవ్వ, అమె మనమరాలు రాణి నివసిస్తూ వుండే వారు. రాణి బొమ్మలు చేయడంలో నేర్పరి. గ్రామంలోని చాలామందికి రాణిని చూస్తే భయం - ఎవరైనా అమెకు ద్రోహం చేస్తే, ఎలాగో కక్షను తీర్చుకుంటుందని.

ఆ గ్రామంలో రామయ్య అనే సరుకులు అమ్మేవాడు ఉండేవాడు. వాడు పచ్చి మోస కారి. గ్రామంలోని జనాన్ని మోసగించి బాగా డబ్బు సంపాదించేవాడు.

ఒకనాడు రామయ్య కొట్లో రాణి అవ్వ సరుకులు కొనడానికి వెళ్లింది. ముసలవ్వ అరువుగా కొన్ని సరుకుల్ని ఇవ్వమంది. కోపంతో వున్న రామయ్య ముసలవ్వను వీధిలోకి తోసి, నలుగురి ఎదుట, "ఏమే, ముసలి పీనుగా! ఇది సత్ర మనుకున్నావా? నీ యిష్టం వచ్చినప్పుడు సరకులు ఇవ్వడా నికి, ఇంతవరకు తీసికొన్న సరకుల డబ్బు ఇవ్వ లేదు. ఇంతలోనే తిరిగి అప్పా? ఈ రోజు సాయంలోగా బాకీ పైకం నాకు చేరాలి; లేదా నీ అంతుచూస్తాను" అంటూ పెద్దగా అరిచి అంగడిలోకి వెళ్లిపోయాడు.

పాపం! ముసలవ్వ నలుగురెదుట అవ మానపడి, ఇంటికి వెళ్లి జరిగినదంతా మనమ రాలికి చెప్పి, పెద్దగా ఏడ్చింది. దాంతో రాణికి కోపం వచ్చింది. తన అవ్వను అవమానిం చిన రామయ్యకు తగిన శాస్తి జరపాలను కొంది. తన అవ్వను ఓదార్చి, పడుకోబెట్టి, రామయ్య లాటి బొమ్మను తయారుచేయడం మొదలుబెట్టింది.

మరునాడు ఉదయం రాణి రామయ్య బొమ్మతో ఊరికి వెలుపల వున్న వంతెనెమీద నుంచి పోతూవుండగా, అమె స్నేహితురాలు చూసి, 'ఎక్కడికి వెళ్తున్నా'వని అడిగింది. రాణి సమధాన మీయకుండా, చేతిలోని రామయ్య బొమ్మను వంతెన మీదనుంచి నీట్లోకి విసిరింది. ఆ బొమ్మ నీటిలోపడి తేలుతూ, కొంత దూరం వెళ్లి మునిగిపోయింది. "ఇంక వారం రోజులలో రామయ్య గతి ఇంతే అవు

ఎ. టి. వనిత, మద్రాసు-1.



ఉంది!" అని స్నేహితురాలితో రాణి చెప్పి, అక్కడనుంచి వెళ్లిపోయింది.

మూడు రోజుల తరువాత రామయ్య కొన్ని సరుకులను తీసుకొని, వంతెన దాటుతూ వుంటే, వంతెన కూలిపోయి, రామయ్య సరకులతో సహా నీళ్లలోపడి చనిపోయాడు. వంతెన కూలిపోయే శబ్దం విని, ప్రజలంతా అక్కడికి వచ్చి, రామయ్య శవాన్ని బయటికి లాగారు రాణి స్నేహితురాలు రామయ్య శవాన్ని చూసి, "ఓరి! విచిత్రంగా వుందే! రాణి చెప్పినట్లు రామయ్య మరణించాడు అతడు చనిపోతాడని ముందుగా రాణికి ఎలా తెలుసు?" అని మనసులో అనుకొంది.

రాణి స్నేహితురాలి ద్వారా గ్రామంలోని వారికి ఈ విషయం తెలిసిపోయింది. అప్పటి నుంచి అందరికీ రాణి అంటే మర్యాద ఏర్పడింది. ఆమె జోలికి ఎవ్వరూ పోయే వారు కాదు

ఒక రోజు రాణి కొన్ని బొమ్మలతో ఆ గ్రామాధికారి యింటిముందు కూర్చుని ఆడుకొంటూ వుండగా, ఇంట్లో నుంచి గ్రామాధికారి బయటికి వచ్చి, రాణిని బాగా తిట్టాడు. రాణి బొమ్మలను తీసుకొని కోపంతో ఇంటికి వెళ్లిపోయింది.

సాయంత్రం రాణి గ్రామాధికారి బొమ్మ మెడకుదారంకట్టి వీధులగుండా తిరగసాగింది. అందరూ మనస్సులో గ్రామాధికారికి సానుభూతులు తెలుపుకొన్నారు.

మరునాడు గ్రామాధికారి యింట్లో ఉరి వేసికొని చనిపోయి వున్నాడు. ప్రజలు కొందరు అతని యింటిని పరిశోధించి, అతను ప్రజల దగ్గర వసూలుచేసిన పన్ను డబ్బులు ఖర్చుపెట్టేసి, తిరిగి ప్రభుత్వానికి డబ్బు యివ్వడానికి తన దగ్గర లేనందున, తనంత తానుగా ఉరివేసికొని చనిపోయాడని తెలుసుకొన్నారు.

ప్రజలందరికీ రాణి అంటే యింకా భయం ఎక్కువైంది. నిజానికి గ్రామాధికారి తనంత తానుగా ఉరివేసుకొని చనిపోయాడా, లేక రాణి చేసిన మంత్రపు బొమ్మ ద్వారా చనిపోయాడా? - అన్నదే వారి ప్రశ్న!

ఒకరోజు రాణి అవ్వకు జబ్బు చేసింది. వైద్యుడు ఆమెను పరిశీలించి, ఇంక ఆమె కొన్ని వారాలు మాత్రం బ్రతకగలదని చెప్పి వెళ్లిపోయాడు. ముసలవ్వ రాణిని పిలిచి,

"అమ్మాయీ! ఈ బాధతో నేను కొన్ని వారాలు ఎలా వుండగలను? దయచేసి నన్ను చంపేయి. అప్పుడైనా నాకు ఈ బాధ తప్పుతుంది" అని ఏడుస్తూ చెప్పింది

"ఏడవకు అవ్వా! నిన్ను ఈ బాధనుండి విముక్తురాల్ని గావిస్తాను. నాచేతనైన సహాయం చేస్తా" నంటూ రాణి అక్కడనుంచి వెళ్లిపోయింది.

మరునాడు రాణి చేతిలో ముసలవ్వ బొమ్మవుండడం చూసి, గ్రామ ప్రజలంతా ఆశ్చర్యపోయారు. కొందరు ఆమెను వెంబడించారు. రాణి శ్మశానంలోకి వెళ్లి, ఒకచోట మన్నును తవ్వి, అందులో ముసలవ్వ బొమ్మ నుంచి. పైన మన్నుపోసి తిరిగి వచ్చేసింది.

ఇది జరిగిన రెండు రోజులకు ముసలవ్వ చనిపోయింది. దాంతో ప్రజలందరికీ రాణి మీద కోపం వచ్చింది. రాణి బొమ్మలు చేసి, ప్రజల్ని చంపడం చూసి, ఆమెలో ఏదో దయ్యం ఆవరించి వుంటుందని అనుమానపడ్డారు. ఎలాగైనా రాణిని చంపేయాలని నిశ్చయించుకున్నారు. ఇద్దరు ముసలవ్వలు, ప్రజల ముందుకు వచ్చి, "మేం ఎలాగైనా, రాణిని అంతం చేయగలం. అప్పుడు మనకు రాణి భయం వుండదు" అన్నారు.

"మావల్ల సాధ్యంకాని పనిని మీరు చేయగలరా?" అని ప్రశ్నించారు. "రాణి చేతిలో



రాణి ప్రజల్ని బొమ్మల ద్వారా చంపుతూ వుంది. ఆ శక్తిని నాశనం చేసామంటే, మనకు రాణి బాధ తప్పుతుంది" అంటూ దగ్గరలో వున్న అంగడిలో బొమ్మను చేయుటానికి కావలసిన సామానులు తీసుకొని రాణి యింటికి వెళ్లారు.

రాణి యింట్లో బొమ్మలు చేస్తూ వుంది. ముసలవ్వలు రాణిని చూసి, "అమ్మాయీ! నీవు బొమ్మలు చేయడంలో నేర్పరివి కదా! నీవు, ఎప్పుడూ అందరి బొమ్మలు చేస్తూ వుంటావు గదా! నీ బొమ్మను ఇంతవరకు నీవు చేయలేదే అది నీవల్ల వీలుకాదా?" అని అడిగారు.

"ఎందుకు వీలుకాదు? నాబొమ్మను చేయ

ముసలవ్వలు సామానులు రాణికిచ్చి, "అయితే నీ బొమ్మను మా ఎదురుగా చేయి, చూస్తాము" అని అన్నారు.

రాణి తన బొమ్మను చేయడం మొదలు పెట్టింది. వాళ్ళిద్దరూ చూస్తున్నంతలోనే బొమ్మను తయారు చేసింది. ముసలవ్వలు ఆ బొమ్మను చేతిలోకి తీసుకుంటూ, "రాణీ! నీ బొమ్మ ఎంత బాగుంది? నీవు యింతకు ముసుపు చేసిన బొమ్మలు తీసుకురా! అన్ని బొమ్మలు కలిపి చూస్తాం!" అని అన్నారు.

రాణి మిగతా బొమ్మలు తీసుకోరావడానికి లోపలికి వెళ్ళింది. అదే సమయమని ముసలవ్వలిద్దరూ రాణి బొమ్మను తీసుకొని బయటికి పరిగెత్తారు. రాణి బొమ్మలతో తిరిగి వచ్చి, ముసలవ్వలు లేకపోవడంతో వీధిలోకి వచ్చి చూసింది. దూరంలో ముసలవ్వలు పరిగెత్తడం కనిపించింది.

"మోసం జరిగిపోయింది! వాళ్లు నా బొమ్మతో పారిపోతున్నారు. వాళ్లని వదల కూడదు" అని వారిని వెంబడించింది.

ముసలవ్వలు యిద్దరూ రాణి బొమ్మతో దగ్గరలో వున్న కొండ ఎక్కేసారు. ఒక బండ రాతిపై రాణి బొమ్మను పడుకోబెట్టి, రాళ్లను తీసుకొన్ని ఆ బొమ్మను కొట్టసాగారు. కొంత సేపటికి ఆ బొమ్మ కొన్ని రాళ్ల మధ్య నలిగి పోయింది. అప్పటికి రాణి కొంత క్రిందికి వచ్చింది. ఉన్నట్టుండి కొండ క్రింద భాగం పగలి, పెద్ద పెద్ద బండ రాళ్లు ఎగిరి రాణి మీద పడినవి. రాళ్లు పడడంతో రాణి అక్కడికక్కడే ప్రాణంవదిలింది.

తర్వాత ఆ గ్రామ ప్రజలందరూ చేరి రాణి శవాన్ని శ్మశానంలో పూడ్చారు. అయినా,అప్పుడప్పుడూ రాణి అవిరి రూపంలో ప్రజలకు కనబడ్తూ వుంటుంది. తనకు మోసం గలిగించిన ఆ ముసలవ్వల్ని పట్టి పీడించి చంపివేసింది.






అనగనగా అది ఒక పెద్ద సామ్రాజ్యము దాన్ని చంద్రసేను డనే మహారాజు ప్రజాను రంజకంగా పాలన చేస్తున్నాడు. ఆస్థానంలో కామయ్య అనే బ్రాహ్మణ పండితు డున్నాడు- తెలివైనవాడు - కడు సమర్థుడు - మహారాజుకు సలహాదారు ఎంతటి జటిల సమస్యనైనా చిటికలో పరిష్కరించగల యుక్తి సంపన్నుడు. అందుచే కామయ్యపై మహారాజు కెనలేని ప్రేమాభిమానాలు.

ప్రతియేటా మహారాజు తన పుట్టిన రోజు పండుగనాడు రాజోద్యోగు లందరికీ శలవు దినంగా ప్రకటించటం ఆచారం! మహారాజు ఆనాడు వచ్చినవారికల్లా లేదనకుండా అన్నదానం, వస్త్రదానం చేసేవాడు. ఆస్థాన కవులు పండితులు గాయకులు - మున్నగు వారందరిని రావించి సభలు, సమావేశాలు జరిపించి ఘనంగా సన్మానించి, పంపించేవాడు.

అయితే, మహారాజులో ఒక దుర్గుణముంది. అదేమంటే - మొండిపట్టుదల. అది ఎల్లవేళలా వుండదు; వస్తే తిరుగుండదు. ఎవరైనా తాను చెప్పింది అంగీకరించి, పాటించి తీరవలసిందే; లేకపోతే కోపంతో మండిపడతాడు. ఆక్షణంలో మూర్ఖుడై పోతాడు. తపీమని శిక్ష వేయటం కూడా జరిగిపోతుంది. అందువల్ల ప్రజలు భీతితో తల్లడిల్లేవారు.

ఆ సంవత్సరం చంద్రసేనుని పుట్టిన రోజు పండుగ వచ్చింది - ఏటా కన్నా ఘనంగా జరిపించుకుంటున్నాడు.

"కామయ్యగారూ! మాకు యీనాటిరోజు ఎంతో ప్రాధాన్యమయింది. వివిధ రకాల జంతువుల మాంసం వండిస్తున్నారు; పానీయాలు సిద్ధం చేస్తున్నారు. ఇంకా అనేక రకాల తినుబండారాలు తయారవుతున్నాయి. ఓ పర్యాయ మలా వెళ్ళి చూచివద్దాం రండి!" అని నవ్వుతూ అన్నాడు మహారాజు.

కామయ్య పండితులవారి గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లయింది.

"మహారాజుకు ఆగ్రహం వచ్చినా, అనుగ్రహం వచ్చినా పట్టలేం - ఏం చేస్తా

ప్రేదు - ఖర్మ!!" అని బాధగా మనస్సులో అనుకుంటూ మహారాజు ననుసరించాడు కామయ్య.

మహారాజు ఠీవిగా చేతులు వెనక్కు పెట్టుకొని, విలాసంగా హుక్కా పీలుస్తూ, వంటశాలలో తయారవుతున్న వంటకాలను చూస్తూ పచార్లు మొదలెట్టాడు. వెనుక కామయ్య నడుస్తున్నాడు.

ఆ వంటల వాసనకు కామయ్యకు ముక్కు పుటాలు పగిలిపోయాయి. కడుపులో దేవినట్లయి, వాంతు లవుతాయేమోనని కంగారు పడిపోయాడు కామయ్య.

"కామయ్యగారూ! ఎలా వున్నాయి వంటలు! కమ్మటి వాసన లొస్తున్నాయి గదూ?" అంటూ వెనుదిరిగి కామయ్య ముఖంలోకి చూసి ఠక్కున ఆగిపోయాడు - మహారాజు.

"ఏమిటి అంతగట్టిగా ముక్కు మూసుకున్నారు? అంత కమ్మటి వాసనలు భరించలేక పోతున్నారా? ఇవన్నీ నా కెంత యిష్టమో తెలుసా? చెప్పలేనంత యిష్టం! ముక్కు మూసుకుని మమ్ముల నవమానించారు" అంటూ కళ్లెఱ్ఱచేసి అన్నాడు-మహారాజు.

వెంటనే కామయ్య "ప్రభువులు మన్నించాలి" వినండి ప్రభూ! చెబుతా "ఆ కమ్మటి వంటశాల గుబాళింపు వాసనలు కడుపులోకి వెళ్ళిపోయాయి. అవి మళ్ళ బయటకు వచ్చేస్తాయేమో నన్న భయంతో బయటకు రానీకుండా ముక్కు మూసుకున్నాను - మహారాజా!!' అని వినయంగా సమాధాన మిచ్చాడు - కామయ్య.

"భేష్ భేష్! కామయ్య పండితులవారి సమయస్ఫూర్తికి మేము అమితానందభరితుల మయ్యాము. మా కోపాన్ని యిట్టే మటుమాయం చేసారు. మీ చమత్కారంతో మా కోపాన్ని సరిదిద్దారు! ఇదిగో! ఈ రత్నాలహారం తమకు కానుకగా యిస్తున్నాం. అందుకోండి!' అంటూ మహారాజు తన మెళ్లోని హారం తీసి కామయ్య పండితుని మెళ్లో అలంకరింపచేసాడు.

కామయ్య సంతోషంతో తబ్బిబ్బయి పోయాడు.






# వెంట్రుక-వెర్రివాడు

## 40

శ్రీమతి శ్రీచరణులు నిద్రలేచి, కాల కృత్యాలు తీర్చి, నదిలో స్నానం చేసి, గాలిలో ఆడే వస్త్రాలు, శిలపైని పదార్థాలు తీసికొని సోమరసం త్రాగి శిలపై కూర్చున్నారు. ప్రార్థన శ్లోకం పఠించారు. అడవిలో నుండి ఘుర్ఘురమని శ్వేతవరాహం వచ్చి ఇసుకలో గుంత చేసిపోయింది. బంగరు మెరుగులతో శ్రీపర్ణం వచ్చి బండపై వ్రాలింది. దాన్ని శ్రీమతి శ్రీచరణులు పట్టుకోబోయారు. అది-

"పాపలూ! నన్ను తాకరాదు - మీకు కమ్మని కథ చెప్తాను వింటారా?" అన్నది. శ్రీమతి శ్రీచరణులు "భలే కథ చెప్పాలి" అని అన్నారు ఆనందంతో. "సరే. వినండి" అన్నది శ్రీపర్ణం.

అనంతవరం గ్రామంలో అన్నయ్య, అన్నమ్మ అనే రైతు దంపతులున్నారు. వారు తమ కాపురమేమో - తామేమో అంతే! మరి వరితో సంబంధం పెట్టుకొనేవారు కారు. వారికి పెద్దలు సంపాదించిన ఆస్తి జీవనానికి సరిపోతుంది. అన్నమ్మ కాపురానికి వచ్చి ఏడేండ్లైనా సంతు కలుగలేదు. అన్నమ్మ దంపతులకు దాన్ని గూర్చిన విచారంగాని, ఆలోచనగాని లేదు.

గంగవరం కాత్రేని జాతర పై వారమని ఊళ్లో వాళ్ళనుకొంటూండగా వారు విన్నారు. కాత్రేని జాతర చూట్టానికి అన్నమ్మ ఆపేక్ష పడింది. అన్నయ్య, అన్నమ్మ జాతరకు పోదామనుకొన్నారు. జాతరకు ముందునాడు అన్నీ సర్దుకొని, ఆనాటి వుదయం ఎద్దుల బండి కట్టుకొని, వలసిన సామాన్లు పెట్టుకొని, ఇల్లు తాళం వేసి, వారు గంగవరం ప్రయాణమైనారు. అనంతవరానికి గంగవరం ఐదు పరుగుల దూరం. వారు మెల్లగా మధ్యాహ్నానికి మూడు పరుగుల దూరం పోయి, గందేరు ఒడ్డు చేరుకొన్నారు. ఆ ఏటొడ్డున బండి నిల్పి దిగారు. అన్నయ్య ఎద్దులను విప్పి ఏట్లో నీరు త్రాపి, వాటిని పగ్గాలతో బండి చక్రాలకు కట్టేశాడు. బండిలోని గడ్డితీసి మేతవేశాడు.

అంతలో అన్నమ్మ బండిలో కట్టి భద్రపరచిన అన్నంమూట దింపింది. ఆ ఆలుమగలు ఏట్లో నీటి దరికిపోయి, కాళ్లు చేతులు కడుక్కొన్నారు. అక్కడే ఎదురెదురుగా కూర్చుని మూట విప్పి అన్నం తింటున్నారు. మూడు ముద్దలు తిన్నారు. నాలుగోముద్దలో ఒకేసారి ఇరువురి చేతుల్లోని ముద్దల్లోకి ఒక వెంట్రుక వచ్చింది - దాన్ని చూచి అన్నయ్య "పాడు ముండ! నీ తల వెంట్రుక అన్నంలోకి వచ్చిందే - ఇదోమాడు!" అన్నాడు. "ఛీ! నీ జుట్టు వెంట్రుక అన్నంలోకి వచ్చింది. ఇదో చూడు!" అన్నది అన్నమ్మ. ఆ వెంట్రుక ఇద్దరి చేతుల్లోని అన్నం ముద్దల్లో పొడుగ్గా వున్న ఒకే వెంట్రుక!

"ఒసేవ్! తీసెయ్ వెంట్రుక!" అన్నాడు గద్దింపుగా అన్నయ్య. "నీవే తీసేయ్!" అన్నది అధికారంగా అన్నమ్మ. ఆలుమగలకు అధికమైంది కోపం. చేతుల్లో అన్నం ముద్దలు అట్టే పెట్టుకొని వాగ్యుద్ధం చేశారు. ఒకరి నొకరు చీదరించుకొన్నారు; కొక్కరించుకొన్నారు. ఒకరి ముఖాన ఒకరు ఉమ్మేసుకొన్నారు. అన్నం ముద్దలు మూటలోకి విసిరి కొట్టి, ఇద్దరూ లేచి జుట్లు జుట్లు పట్టుకొన్నారు. 'నీకంటే నేనేం తీసిపోయానా?' అని పోట్లాడుకొన్నారు. వారి పోట్లాట ఏటి రాళ్ళతో కొట్టుకొనే స్థితికి వచ్చింది. అంతలో బిగ్గరగా నవ్వుతూన్న శబ్దం వినిపించింది. ఆలుమగలు పోట్లాట మాని అటువైపు చూచారు. చిందర వందర జుట్టుతో, చినిగిన బట్టలతో వున్నవాడొకడు అన్నం మూట దగ్గర కూర్చుని-ఓ చేత వెంట్రుక పట్టుకొని, ఓ చేత అన్నం తింటున్నాడు. మూటలో అన్నం కొంచెం మిగిలిందేమో! అంతా తీసి నోట కూరుకొని మూట గుడ్డ ఏటి నీళ్లలోకి విసరి వేశాడు.

"ఓరీ, నీ కడుపుకాలా! మా అన్నమంతా బొక్కి, నీ పొట్టనింపుకొన్నావు గదరా!' అంటూ అలుమగలు వాని దగ్గరికొచ్చి 'అ వెంట్రుకతో కూడా దిగమింగావట్రా! పాపిష్టివాడా! చచ్చేవురా!" అని ఆక్రోశంతో వారు వాని వీపుపై నాలుగు బాదారు. వాడా దెబ్బలు లెక్కచేయక గుటుక్కున ముద్ద మింగి, తాపీగా ఏట్లో నీళ్లు త్రాగి, వచ్చి పక పక నవ్వుతూ వెంట్రుక మెడకు చుట్టుకొంటూ, అటనుండి ఏరుదాటి, ఆ వైపుకు వెళ్లాడు. ఆ వెర్రివాణ్ణి చూస్తూ అలుమగలు తిట్టుకొంటూ బండి దగ్గరకు వచ్చారు. అన్నయ్య ఎద్దులను బండికి కట్టాడు; అన్నమ్మ బండెక్కి కూర్చుంది. బండి ఏరు దాటి ఆవైపున గంగవరం దారిపట్టింది. దారిలో అలుమగలు ఒకరితో ఒకరు మాట్లాడుకో లేదు. బండి గంగవరం చేరేప్పటికి రెండు బార్ల ప్రొద్దే మిగిలింది.

గంగవరం కార్తేని జాతర సంబరంతో కోలాహలంగా వుంది. ఆడా మగా మహోత్సాహంతో వున్నారు. ఆ వూరి ప్రక్క పారే గండేరులోని నీళ్ళలో మునిగి వూరి నడుమ నున్న కార్తేణ్ణి దర్శిస్తున్నారు జనం. కొందరు ఆడవారు తడి బట్టల్తో దేవుని కెదురుగా బిడ్డలు కావాలనో, పాడిపంటలు కలగాలనో - ఏవేవో మ్రొక్కులు మ్రొక్కుతూ బోర్లపడుకో నున్నారు. కొందరికి దేవుడు మ్రొక్కులు [illegible]

చెప్పుకొని సంతోషిస్తున్నారు. కొందరు తమ విషయం చెప్పుకోడానికి సిగ్గుపడుతున్నారు.

అన్నయ్య ఎడ్లబండిని అక్కడున్న ఓ చెట్టుక్రింద నిల్పాడు; అన్నమ్మ బండి దిగింది. అన్నయ్యకు ఆకలి రగులుకు పోతూందేమో! ఎద్దుల్ని విప్పి మేత బీటికి వదలి - బండ్లోని సామాను దించుకొన్నాడు; చెట్టుక్రింద రాళ్ళతో పొయ్యిపెట్టి వంటచేశాడు. కుండతో ఏటి నీళ్ళు తెచ్చి బియ్యం కడిగి కుండలోపోసి పొయ్యిమీద పెట్టాడు. అన్నమైంది. అన్నాన్ని అంగవస్త్రంలో క్రుమ్మరించుకొని చట్టితో తెచ్చుకొన్న ఊరుగాయ నంజుకొని కడుపు నిండా తిని, వట్టికుండలో నీళ్ళుపోసి కాట్రేని గుడికెళ్లాడు. మగని చర్యచూస్తూ అన్నమ్మ చెట్టుక్రింద అట్టే కూర్చునుంది. అన్నమ్మకు ఆకలితోపాటు ఆగ్రహం ముంచుకొచ్చింది విసురుగా లేచి కాట్రేని గుడికెళ్లింది. అప్పటికి బాగా చీకటిపడింది.

కాట్రేనికి ఉత్సవం జరుగుతూంది. ప్రభలు ముందు కదుల్తున్నాయి; బాకాలు మ్రోగుతున్నాయి; దివిటీలు వెలుగులు చిమ్ముతున్నాయి. ఆ సందడిలో జనం దేవుని చూడాలని గుంపుగా గుళ్లోకి త్రోసుకొని వచ్చారు. ఆ త్రోపులో అన్నమ్మ వచ్చి మంటపంలో స్తంభానికి చేరబడింది. అంతలో ఎవరు తోశారో! అన్నయ్య వచ్చి ఆమెమీదపడ్డాడు "పాపిష్ఠోడా! దున్నలాగున్నావురా! మీద పడ్డమా? కళ్లు నెత్తికెక్కాయా?" అంది. అన్నయ్య భార్య గొంతు గుర్తించాడు - "పాపిష్టిదానా! నా కడ్డమొచ్చి పడద్రోశావా? నా మోకాలు బొప్పికట్టిందే ముండా!"




అని లేచి, లేవబోయే ఆమెను ఓ త్రోపుతోసి, ఎటో గుంపులో కలిసిపోయాడు. అతని గొంతు విని తన మగడేనని గుర్తించిన అన్నమ్మ ప్రక్కవారిపై పడింది. వారామెను అటు ఇటు త్రోశారు. ఆమె మరల క్రిందపడి తిట్టుకొంటూ లేచి కూర్చుని, ఆపసోపాలుపడ్తూ ఆ సందడి చూస్తూంది అక్కడే!

ఉత్సవం ఊళ్లోకి పోయింది. గుడిముందు జనం పల్చబడ్డారు. మండపంలో ఓ స్తంభం చాటున ఓ ముసలవ్వ పండుకోనుంది. తడి తలతో, తడిగుడ్డల్తో టెంకాయ చేతపట్టుకొని ఓ అమ్మాయి ఆ అవ్వదగ్గరకు వచ్చింది. "అత్తా అత్తా!" అంది. ఆ అవ్వ నిద్రలేచి కళ్లునులుముకొంటూ ఆవలించి, "ఏమే! అప్పుడే వచ్చావు? తెల్లారిందాకా వరపడాల్నే, పిచ్చిదానా!!" అంది. ఆ అమ్మాయి "నేను వరపడి పడుకోగానే బాగా నిద్ర వచ్చేసిం



దత్తయ్యా! ఏం చెప్పను దేవతలేమో! ఆబ్బ వారెంత అందగత్తెలు! వారు నన్ను పూల పల్లకిలో కూర్చోబెట్టుకొని ఆడుతూ, పాడుతూ కాత్రేడి దగ్గరికి తీసికొనిపోయా రత్తయ్యా! కాత్రేడు నన్ను చూచి, 'నీవేం తెచ్చావు?' అనడిగాడు "స్వామీ! ఈ కొబ్బరికాయ తెచ్చాను' అన్నాను. కాత్రేడు నా చేతిలోని కొబ్బరికాయ తీసికొని, నాకో జామపండిచ్చి 'తిను' అన్నాడు. నే నా పండు తినేశాను. కాత్రేడు ఇంక పో' అన్నాడు. అంతే మెలుకువ వచ్చింది, లేచి చూచాను. ఇంకా కొంద రక్కడే వరపడే వున్నా రత్తా!" అన్నది. ఆ అవ్వ సంతోషంతో "ఆ! ఆ! నా బంగారు కోడలా! కాత్రేడు నీకు జామపండిచ్చాడు! ఎంత అదృష్టమే నీది? నా చిట్టితల్లి వే! ఇంకేమే, నాకు మనమణ్ణి ఇస్తావే నీవు! కాత్రేని మాట తప్పునే తప్పదు" అని కౌగలించుకొని కోడల్ని

ఆమె బుగ్గలొత్తి, గడ్డంముద్దాడి, తల నిమిరి, తలపైన మెటికలు విరిచి లేచింది. ఆమె కాత్రేని గుడిగోపురం చూచి చేతులెత్తి, "నా కోడలు కొడుకు నెత్తుకుంటే పై యేడు నీ తిరణాలకు ఇలుతీర్థం వస్తాం దేవుడూ!" అని దండం పెట్టింది. కోడల్ని పిల్చుకొని అక్కడినుండి వెళ్ళిపోయింది.

అన్నమ్మ వారి మాటలు వింటూ, రెప్ప వాల్చకుండా వారిని చూచింది. తటాలున లేచి ఏటికి పోయి నీళ్ళలో మూడు మున్కలు వేసి, తడిబట్టల్తో గుళ్ళోకి వచ్చింది. అక్కడ వరపడిన వాళ్ళెవరూ లేరు. అన్నమ్మ దేవునికి దండంపెట్టి "నాకో కొడుకునిస్తే ఏటా నీ జాతరకు వస్తాను" అని మ్రొక్కి, ధ్వజస్తంభం దగ్గర చేతులు జోడుగా చాచి, బోర్లపడు కొంది. అక్కడున్న కొందరు "అమ్మో ఈమె కెంత భక్తి! పుండువంటి చల్లో- ఇంత రాత్రిలో- ఒకతే వరపడుతూ oదే!" అని ఆశ్చర్యపడ్డారు.

ఉత్సవం ఊళ్లో తిరిగి వచ్చేటప్పటికి తెల్లారింది. ఉత్సవంతో కూడా తిరిగి అన్నయ్య గుడిచేరాడు. ధ్వజస్తంభం దగ్గర వరపడి వున్న భార్యను చూచి అట్టే విలబడ్డాడు. ఇంతలో వెర్రివాడు వచ్చి, "ఛంఛో - ఛంతర! ఛీ ఛీ!" అని వెక్కిరింపుగా అరుస్తూ, ధ్వజ స్తంభం చుట్టూ వెంట్రుక పట్టుకొని ఎగురు తున్నాడు. ఆ తిరిగేటప్పుడు వాని పాదం అన్నమ్మ చేతిపై పడింది. "అబ్బా!" అంటూ లేచి, అన్నమ్మ వాణ్ణి అనరాని తిట్లు తిట్టింది. వెర్రివాడు నవ్వుతూ—

"అమ్మోరికి దణ్ణాలు - అయ్యోరికి దణ్ణాలు



అంతా నాదే - అంతానాదే" అని పక పక నవ్వాడు.

అక్కడి వారందరికీ వాని చేష్టలు నవ్వు పుట్టించింది. అన్నమ్మ కోపంతో గిరున తిరిగి గుడిదాటి పోయింది - అన్నయ్య భార్య వెంట వెళ్లాడు. అన్నమ్మ బండిదగ్గర రుస రుస లాడుతూంది ఎద్దులను బండికి కట్టించి మూట ముల్లె కట్టి బండ్లోకి విసిరేసి ఎక్కి కూచుంది అన్నయ్య మాటాడక బండి నొగల్లో కూర్చుని ఎద్దులను సెలగోలతో అదిలించాడు ఎద్దులు అనంతవరం దారిబట్టి బాగా ప్రొద్దుగ్రుంకే వేళకు అన్నయ్య ఇంటి ముందాగాయి. అన్నయ్య బండినుండి ఎద్దులను విప్పాడు. అన్నమ్మ బండిదిగి మూట చంకపెట్టుకొని ఇంటి వాకిటికి వచ్చిచూచింది. తాళం తీసి తలుపు ఓరగా వేసివుంది. అన్నమ్మ ఆశ్చర్యంతో తలుపు తీసింది. ఇంట్లో చీకటి! మూట క్రిందపెట్టి వెళ్లి, ప్రక్కింటి గూటిలోని దివ్వె తెచ్చి చూచింది. లోపల వెర్రివాడు పడుకొనున్నాడు. 'అమ్మో! వెర్రోడు!' అంటూ అరచి, చేతిలోని దివ్వె జారవిడిచింది అది మూట పైబడి మూట అంటుకొంది. గుప్పున మంటలేచి ఇల్లు అంటుకొంది. 'ఓయ్యో మొర్రో' అంటూ అన్నమ్మ వెలుపలకు పరుగెత్తింది. పసులకొట్టంలో ఎద్దులకు మేత వేస్తున్న అన్నయ్య పరుగున వచ్చి చూచాడు మంటలు నడిమింటికి ప్రాకాయి. ఊళ్లోవారు మంటలార్ప యత్నించారు. "వెర్రివాడు - వెర్రివాడు" అని అన్నమ్మ అరిచింది ఏడుస్తూ ఆమె మాటలు ఏమో, ఎవరూ పట్టించుకోలేదు. ఇంతలో మంటలతో తలుపు తెరుచు



కొంది. వెర్రివాడు పక పక నవ్వుతూ, తాపీగా అంటుకొన్న గుడ్డలు నులుముకొంటూ వెలుపలికి వచ్చి ఎగురుతూ—

"ఇల్లు కాలితే నాకేమీ? - ఇల్లాలు కాలితే నాకేమీ?"

నా వెంట్రుక వున్నది నాకేమీ? - మీరు నా వెంటబడితే నాకేమి? అంటూ వెళ్లాడు.

ఇల్లంతా కుప్పకూలి బూడిదైంది. జనం ఎవరిండ్లకు వారు వెళ్ళారు. అన్నమ్మ ఇంటిని చూస్తూ ఏడుస్తూంది అన్నయ్య ఆమెను పలుకరించలేదు అన్నమ్మ మగణ్ణి కన్నెత్తి చూడలేదు. ఆ రాత్రి ప్రక్కింటి కనకమ్మ అన్నమ్మకు, ఎంకమ్మ అన్నయ్యకు, అన్నం పెట్టి ఆదరించారు. అన్నయ్య తన ఇంటి కెదురుగా నున్న రచ్చబండపై పండుకొన్నాడు.

తెల్లారింది. వెర్రివాడు వెంట్రుక చేతపట్టు కొని అన్నయ్య ఇంటి చుట్టూ తిరుగుతూ—

"పుట్టనవానికి దక్కేదీ వట్టి బూడిదేరా
పుట్టినవానికి దక్కేది గట్టి బూడిదేరా
పట్టుబట్ట దానంతు తేల్చుకోరా
దిట్టవు నీవై పుట్టినచోటికి నీవు చేరుకోరా!'

అని పాడుతున్నాడు. అన్నయ్య తలుపు నులుముకొని చూచాడు. వెర్రివాడు ఆ పాడు గాటి వెంట్రుక చుట్టచుట్టి, ఇంటి వాకిట పెట్టి, దోళ్లతో ఆ యింటి బూడిద త్రోసి, దానిపై కుప్పపోస్తున్నాడు. అమ్మ అక్కా, అయ్య అన్నలూ, పిల్లా జెల్లా అక్కడ చేరారు.

'అక్కరగలవాడు అలాపుంటే
అక్కర లేనోడు అనుకోవాలంటే'

అంటూ ఆవేడి బూడిదంతా కుప్పపోశాడు. వెర్రోడు. వాడు కుప్పచుట్టూ తిరుగుతూ—

"ఆలుమగలు చేతులు కలిపి అందుకొంటే
అందుతుందిలే భూతల స్వర్గం ఈమాటే"

అని పాడి బూడిదకుప్పలో చేతులు పెట్టి, సర్రున పాడుగాటి వెంట్రుక తీసి మెడకు చుట్టుకొని వెళ్లిపోయాడు.

అన్నమ్మ, అన్నయ్యలు తమ యింటిని గూర్చి పట్టించుకోలేదు మనకెందుకులే- అని ఇరుగు పొరుగులు వెళ్ళారు. అటూ ఇటూ ప్రొద్దు నడిమింట చేరుకొంటూంది. ఎదిరింటి ఎంకమ్మ అవ్వ ఊతపొడుచుకొంటూ వచ్చి, "ఏమే అన్నూ! ఆలుమగలు అలా నిల్చున్నారే! ప్రాప్తంలేదులే! బుగ్గపోయిన ఇల్లు ఎట్లాగో నిలేసుకోండి తలా ఓ కర్రో, కట్టో సాయం చేస్తార్లే! ఇద్దరూ కలిసి ఆ బూడిద బుగ్గి బొగ్గులు ఎత్తి పోసికొని శుభ్రం చేసికోండి! వా డెవడో వెర్రోడు బూడిద కుప్ప పోసిపోయాడు - పుణ్యాత్ముడు. వాడు వెర్రోడు కాడ్రా మహానుభావుడు!" అంటూ తనింట్లోకి వెళ్లి, ఓ చేట పారకా తెచ్చి పడేసి, 'చూస్తారేమ్రా?—ఎత్తండి ఆ బూడిద కుప్ప' అంది



అలుమగలు తమ మూతులు చెరో వైపు త్రిప్పుకొన్నారు. "అన్నా! అలా మూతి ముడుచుకొంటా వేమిటే? నీ యిల్లు బంగా రంగాను!" అంది. "చాల్లే అవ్వా! అయన్నే ఎత్తిపోయమను" అని మూతి విరిచింది - అన్నమ్మ. అవ్వ అన్నయ్యతో "ఒరే అన్నా! నీవైనా బూడిద ఎత్తి అందీయరా! అన్న పారబోస్తుంది. మగాడివి అలా నిల్చున్నావే!" అంది. "ఆ బాగా చెల్లావులే ఆ పాపిష్టి దానికి నే నందీయాలా? అది పోయాలా? దాని కొంప అదే కూర్చుకొంటుందిలే!" అన్నాడు రోషంగా. "ఓహో! మీ ఆలుమగల నడుమ ఏవో వున్నాయే రవ రవలు! నాకెందుకులే నాయనా! ఆలుమగల తగవుల్లో తలదూరిస్తే పోకవత్తి కింది వక్కలా ముక్కలై పోతారు" అంటూ వెళ్లింది.

అంత అన్నమ్మ "నేను పాపిష్టిదాన్ని, నీవు పుణ్యాత్ముడివి! నీవే ఏలుకోవయ్యా! ఈ బుగ్గి గుగ్గిలం—" అని కోపంతో మెటికలు విరిచింది. అన్నయ్య కోపంతో "ఛీ! నోర్ముయ్. వీపు చిత్రక్కొడ్తాను నీవే ఏలుకో బుగ్గి గుగ్గిలం' అని అన్నమ్మ జుట్టుపట్టుకొని వీపున బాదాడు. అన్నమ్మ అన్నయ్య జుట్టుపట్టుకొని క్రుంగ దీసింది. పిల్లా జెల్లా వారిచుట్టూ చేరారు. రోషంతో ఆలుమగలు సిగపట్టు వదలలేదు. అంకమ్మ కొడుకు భీమయ్య వచ్చి ఇద్దరినీ విడిపించబోయాడు. కాని సాధ్యం కాలేదు. భీమయ్య వారిని బలంగా త్రోశాడు. ఆ త్రోపుతో వారు బూడిద కుప్పలో ముందుకు తూలి ఒకరి చేతు లొకరుపట్టుకొని కూలకొనిపడ్డారు. గుప్పున బూడిద వారిపై క్రమ్మింది. బూడిద విదలించుకొంటూ, కూలకున్న చేతులు తీసి కొన్నారు. వారి చేతుల్లో ఓ కుండ వుంది. ఓ చేత కండ్లకు క్రమ్ముకొన్న బూడిద తుడుచు కొంటూ కుండ 'నాదీ, నాదీ' అని లాగారు. అది జారి క్రిందపడింది. దాంట్లోనుండి బం-



గారు కాసులు చెదరిపడ్డాయి. అన్నమ్మ, అన్నయ్యలు "అమ్మో! బంగారు కాసులే!" అంటూ తొందరగా తమ ఒళ్ళోకి త్రోసి కొన్నారు.

"ఓసే! అన్నా! ఇది ఆ వెర్రోడి మహత్తేనే! లేకుంటే బూడిదలో కాసు లుంటాయా? ఇకనైనా మీ అలుమగల్లు అన్యోన్యంగా వుండడ్రా! నాలుక్కాసులు ఖర్చుపెట్టి ఇల్లు నిలేసుకోండి!" అని ఎదిరింటి ఎంకమ్మవ్వ బోసినోటితో నవ్వుతూ చెప్పింది. 'అట్లేలే' అని అలుమగలు ఒక్కమాటగా అన్నారు. వారు నాలుక్కాసులు చేసి, కొత్తగా కొయ్యలు తెప్పించి ఇల్లు నిలేసుకొన్నారు. రవ రవలు లేకుండా సుఖంగా వున్నారు.

ఓనాడు వెర్రివాడు వెంట్రుక పట్టుకొని, ఏవో పాటలు పాడుకొంటూ వీధిలో పోతున్నాడు. అతని మహత్మ్యం వల్లనే అన్నమ్మ దంపతులు భాగ్యవంతు లయ్యారని ఆవూళ్లో ఇరుగు పొరుగు అనుకొన్నారు. ప్రతి ఇంటి వారు వెర్రివాణ్ణి పిల్చి ఆకో, అంబలో, అన్నమో పెట్టి తృప్తిపరచా లనుకొన్నారు; దాంతో తమను కూడా భాగ్యవంతులను చేస్తాడనే ఆశతో వెర్రివాణ్ణి వారు పిల్చేవారు. కాని, అత డెవ్వరింటికీ పోయేవాడు కాదు. మధ్యాహ్నమైంది. అతడు పాడుకొంటూ అన్నమ్మ ఇంటికి వెళ్లాడు. అన్నమ్మ అతన్ని అన్నం తినుమంది. సరేనని [illegible]న్నాడు. అన్నమ్మ ఆకులో అన్నం వడ్డించి [illegible] దార్లాబు వేసింది. వెర్రివాడు మెడకు చుట్టుకొన్న వెంట్రుక తీసి అన్నం చుట్టూ త్రిప్పి -

"పిల్లా జెల్లా లేనివారు పెట్టే పిడికిలి పట్టనురా! పిల్లలు లేని కొంపల్లో కోకోల్లగ పుట్టేర్రా! అల్లెం బుల్లెం అలుమగలకు మెడగొల్లెం గొల్లెం గిల్లెం అందరి కందనిసరిపల్లెం" అంటూ లేచి ఆకులోని అన్నం ఇల్లంతా ఎగజిమ్మాడు ఓ పిడికెడు మెతుకులు పట్టి పిడిచి, అన్నమ్మ ముఖానికేసి కొట్టాడు. 'ఆఁ!' అని ఆశ్చర్యంగా నోరుతెరచి చూస్తున్న అన్నమ్మ నోట్లో అన్నం ముద్ద కూరుకొంది. అన్నమ్మ ఆ ముద్దను గుటుకున మింగేసింది. అది చూచి వెర్రివాడు:

"ఔరా! ఔరా! అన్నమ్మా! అన్నం ముద్ద మింగావా?

ఔరా! ఔరా! చిన్నమ్మా! చిన్న పాప నిస్తావా?" అని పాడుకొంటూ గంతులేస్తూ వెళ్లాడు.

అంతలో పొలంనుంచి వచ్చిన అన్నయ్య ఇంట్లో అన్నం వెదచల్లి వుండడం చూచి, "ఏమే! పొగరెక్కిందా! దరిద్రగొట్టుదానా! పుట్టరాని అన్నం ఒలకబోసావే!" అని చేతిలోని ములుగర్రెత్తి అన్నమ్మ వీపుపై రెండు పెట్లు పెట్టాడు అన్నమ్మ ఏడుస్తూ వీధిలోకి పరుగెత్తింది. ములుగర్రెత్తికొట్టే అన్నయ్యకు, ఆమెకు నడుమ తటాలున వెర్రివా డొచ్చి నిలబడ్డాడు. అన్నయ్య విసిరిన ములుగర్ర వెర్రివాని వీపుపై వ్రాలి, పెటిల్లు మన్నది. వెర్రివాణ్ణి కొట్టినందుకు అన్నయ్యను అందరూ తిట్టారు వెర్రివాడు నవ్వుతూ ములుగర్ర పట్టుకొని, రెండుగా విరిచి, దానికి వెంట్రుక కట్టి విసిరాడు. అది వెంట్రుకను విప్పుకొని బెదిరి అన్నయ్య వీపుపై దెబ్బతీసింది. ఆ దెబ్బ తట్టుకోలేక అన్నయ్య క్రిందపడ్డాడు- వెర్రివాడు.

'అన్నా! అన్నా! జలుకెందకురా?

సున్నా సున్నా ఇలకందదురా!" అని వెంట్రుక మెడకు చుట్టుకొని పాడుకొంటూ వెళ్ళాడు.

మరలా అలుమగల నడుమ 'ఉఫ్' అంటే భగ్గుమని మంటల్లేస్తున్నాయి. ఎడ మొగం పెడమొగంగా సంసారం సాగిస్తున్నారు. ఇలా రెండు నెలలు గడువగా ఓనాడు అన్నమ్మ వాంతిచేసుకొని, క్రింద వ్రాలి పోయింది. పరుగున వెళ్లి తన భార్య పడడం గూర్చి అన్నయ్య ఎదిరింటి ఎంకమ్మతో చెప్పాడు. ఆమె ఊతపాడుచుకొంటూ వచ్చి, అన్నమ్మను పరామర్శించి చూచి, ముఖాన నీళ్లుచల్లి సేద తీర్చింది. అన్నమ్మ లేచి తన ఇంటిపనిలో నిమగ్నమైంది. అన్నయ్య వీధి అరుగుపై కూర్చుని నారతో త్రాళ్లు పేను కొంటున్నాడు. "ఓ అన్నమ్మ మగడా! నీ ఇల్లాలు చూలాలైంది. ఏడ్నెల్లకు పిల్లాడి నెత్తు కొంటావులే!" అంటూ బోసినవ్వు అన్నయ్యపై విసరి వెళ్లింది - ఎంకమ్మ. అన్నయ్య ఆట్టే ఎంకమ్మను చూస్తూ త్రాడు పేనడం మాను కొన్నాడు.

అన్నమ్మ చూలాలన్నమాట ఆ అమ్మ, ఈ అమ్మ నోట ప్రాకింది. కొందరు - అది వెర్రోని మహత్తులే - అనుకొన్నారు. వెర్రోడు గిర్రోడు లేదు పాపపుణ్యంటే అదే వసుంది - అన్నారు



కొందరు. అంతా ఆ గంగవరం కాట్రేని చలవే! - అనుకొన్నారు మరికొందరు. అన్నమ్మకు తొమ్మిదినెలలు నిండి చక్కని మగబిడ్డను కన్నది. బిడ్డను చూచి ఆడం గులు "అబ్బ! ఎంత ముచ్చటగా వున్నాడే! అన్నమ్మ కడుపున పుట్టవలసినవాడు కాదే! ఏ మహారాణికో పుట్టవలసినవాడే!" అని అబ్బు రంగా అనుకొన్నారు. బిడ్డను చూచిన అన్నయ్య అన్నమ్మపై ఆక్రోశం అడచుకొని, ఆదరంతో వున్నాడు. అన్నమ్మ బిడ్డని అల్లారుముద్దుగా పెంచింది. బిడ్డకు అన్నమ్మ 'కాట్రేడు' అని పేరు పెట్టుకొంది. బిడ్డకు మూడేండ్లునిండింది. ప్రతియేటా తన మాటప్రకారం గంగవరం కాట్రేని జాతరకు పోయి మ్రొక్కు చెల్లించి వసూండి.

ఓనాడు కార్తేయుడు వీధి గుమ్మంలో కూర్చుని ఆడుకొంటున్నాడు. వెర్రివాడు ఏవో పాడుకొంటూ వచ్చి, కార్తేయుణ్ని ఎత్తుకొని ఆడిస్తున్నాడు. బిడ్డడు వెర్రివాణ్ణి బిక్కిరిగా చూస్తున్నాడు. అన్నయ్య, అన్నమ్మలు చూస్తూ గుమ్మంలో నిల్చున్నారు. వెర్రివాడు బిడ్డ నెత్తుకొని అటనుండి వీధి దారిబట్టి పోతున్నాడు. ఆ అలుమగలు 'మా బిడ్డ! మా బిడ్డ!' అంటూ అతని వెంట పడ్డారు. జనం ప్రోగైనారు. అన్నమ్మ కన్నీరు మున్నీరుగా ఏడుస్తూంది. జనం బలవంతంగా బిడ్డన్ని తీసికోబోయారు. వెర్రివాడు పకపక నవ్వుతూ, తన మెడకు చుట్టుకొన్న వెంట్రుక తీసి వారికి చూపించాడు. అదేమో! అందరూ ఎక్కడివారక్కడ నిశ్చేష్టులై బొమ్మలవలె నిల్చిపోయారు. వెర్రివాడు వెంట్రుకను మెడకు చుట్టుకొని నవ్వుతూ— బిడ్డ నాడించుకొంటూ-

'అమ్మలారా! ఎవరిది ఎవరికో!
అయ్యలారా! ఎవరికి ఎవరిదో!
నీవు నేను ఎవరికి ఎవరో!
నేను నీవు వారికి వారే!'

అని పాడుకొంటూ ఆ ఊరుదాటి వెళ్లిపోయాడు.

పాపలూ! విన్నారా కథ! అలుమగల నడుమ రవ రవలుపుడ్తే ఏలావుంటుంది? నమ్మకమే మన బతుక్కు ప్రాణం! వెర్రివాని చేష్టల్లో ఎన్ని వింతలు! వెర్రివాడెక్కడికెళ్లాడు? బిడ్డేమైనాడు? వెంట్రుకకు మహత్తెలా వచ్చింది? మా చెల్లి రేపు చెప్పే కథవిని తెలుసుకోండి - ఇకనే వత్తునా?" అని శ్రీ పర్ణం ఎగిరి ఇసుక గుంతలో వ్రాలింది. అందు అందమైన శిల్పసుందరీ స్తంభం నిల్చింది. శిలపైన 'రి' అనే అక్షరం వెలిసింది. అంతలో ప్రొద్దు గ్రుంకిందని శ్రీమతీ శ్రీచరణులు శిలక్రింది గుహలోకి వెళ్లి వింతశబ్దాలు వింటూ నిద్రించారు.

—మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యం,
బుడుగుంటపల్లె.






# విచిత్ర వ్యక్తి

రష్యా దేశంలో చెప్పులు కుట్టే ఒక ముసలివాడు, వాని భార్య నివసించేవారు. ముసలివాడు ప్రతిదినం ఉదయమే ఇంటి నుండి బయలుదేరి బజారుకు వెళ్లి, అచ్చటనే రాత్రి వరకు చెప్పులు కుట్టి, వచ్చిన సొమ్ముతో కావలసిన సరకులు కొని ఇంటికి తీసుకు వెళ్లేవాడు.

చలికాలం వచ్చింది. చలి విపరీతంగా వుంది. ఒక రోజున ముసలివాడు బాగా చీకటిపడేవరకూ చెప్పులు కుట్టి, ఆ రోజు వచ్చిన సంపాదనతో కావలసిన సరుకులు కొనుక్కొని, చలి తెలియకుండా వుండడానికి మత్తు పానీయం సేవించి, ఇంటికి బయలుదేరాడు. దారిలో ఒకచోట ఒక వ్యక్తి నగ్నంగా చలికి గడ గడ వణుకుతూ కదలలేని స్థితిలో అతనికి కనిపించాడు. ఆ వ్యక్తిని చూచి జాలిపడి తను కప్పుకున్న దుప్పటిని, తొడుక్కున్న కోటును తీసి అతనికిచ్చి ఆ వ్యక్తిని లేవదీసి తనతో ఇంటికి తీసుకువెళ్ళాడు.

ముసలివాడి భార్య తమకే తిండైనా లేని సమయంలో అతిథిని కూడా వెంటబెట్టుకుని వచ్చినందుకు మొదట భర్తమీద మండి పడింది. ఆ వ్యక్తి ఎటువంటి స్థితిలో నుండగా తను తీసుకు వచ్చినదీ చెప్పి, ఆమెను శాంత పర్చాడు - ముసలివాడు ముసలిది కూడా జాలిపడి ఆ వ్యక్తికి తమ తిండిలోనే కొంత పెట్టి, ఆ రాత్రికి తమ అతిథిగా వుంచుకున్నారు.

మర్నాడు ముసలివాడు ఆ వ్యక్తిని అతని గురించి వివరాలు అడిగాడు. ఆ వ్యక్తి తనకు ఎవరూ లేరని, ఒంటరివాడినని, ఏం పని చెప్పినా చేస్తానని, తమ ఇంటివద్దనే వుంచుకోమని కోరాడు కొద్ది సేపు ఆలోచించి, అందుకు ఒప్పుకున్నాడు - ఇంటి యజమాని. తను ముసలివాడై పోయిన కారణంచేత పని ఎక్కువగా చేయలేక పోతున్నాడు అటువంటి సమయంలో దేముడు పంపినట్లు వచ్చిన ఇతనిని చూచి సంతోషించాడు ముసలివాడికి ఆ వ్యక్తి ప్రవర్తన విచిత్రంగా తోచింది

ముసలివాడు ప్రతి దినం ఆ విచిత్ర వ్యక్తిని కూడా తనతోపాటు బజారుకు తీసుకు వెళ్ళి,

శ్రీమతి డి. సుశీలా తులసీరావు, కాకినాడ 3.



అతనిచేత కూడా చెప్పులు కుట్టించేవాడు. ఆతిత్వరలో నే ఆవిచిత్ర వ్యక్తి జోళ్ళు తయారు చేయడంలో మంచి ప్రావీణ్యతను సంపాదించాడు. విచిత్ర వ్యక్తి ప్రావీణ్యం వలన ముసలివాడికి నగరంలో గిరాకీ బాగా పెరిగిపోయింది. నగరంలోని సంపన్నులు కూడా తమ జోళ్ళను తయారుచేయమని ముసలివాడి వద్దకే వచ్చేవారు. అచిరకాలంలోనే పేరు పొందిన ముసలివాడు తన జోళ్ళ దుకాణాన్ని ఇంటివద్దకు మార్చివేశాడు. అందుచేత అందరూ అతని ఇంటికే వచ్చి తమ పనులు చేయించుకునేవారు. కాని ఇంత పేరు ప్రతిష్ఠ తెచ్చిపెట్టిన ఆ విచిత్ర వ్యక్తి మాత్రం ఎప్పుడూ అవసరాన్ని మించి ఎవరితోను మాట్లాడేవాడు కాడు. ఎక్కువగా తన కాలాన్ని పనిచేయడంలోనే గడిపేవాడు. తీరిక సమయంలో ఏదో ఆలోచిస్తూ ఒంటరిగా గడిపేవాడు.

ఒకరోజున ఉదయమే జమీందారుగారు తన గుర్రపు బండిలో ముసలివాడి ఇంటికి వచ్చారు. ఆయన వచ్చే సమయానికి విచిత్ర వ్యక్తి ఎవరివో జోళ్ళను తయారుచేస్తున్నాడు. విచిత్ర వ్యక్తి గుర్రపు బండిలో నుండి దిగి వస్తున్న జమీందారుగారిని తల ఎత్తి చూచి, చిన్నగా నవ్వి, తిరిగి తలవంచుకుని తన పనిలోని మగ్నమై పోయాడు. ముసలివాడు మాత్రం జమీందారుగారు స్వయంగా తన ఇంటికి వచ్చినందుకు సగం ఆనందంతోను, సగం గాభరాతోను హడావుడి పడి, ఆయనకి ఎదురేగి స్వాగతం పలికాడు. జమీందారుగారు ఇంట్లో అడుగుపెట్టేముందు, ముఖద్వారం పొట్టిగా వుండడాన్ని, తలను బాగా వంచి లోపలికివచ్చి, ముసలివాడు చూపించిన ఆసనంపై ఆసీనుడయ్యాడు. ముసలివాడు చేతులు నులుపుకుంటూ, ఆయన చెప్పబోయే ఆజ్ఞ కోసం ఆతృతగా ఎదురు చూడసాగాడు.

జమీందారుగారు తనతో తీసుకు వచ్చిన మంచి ఖరీదైన, మేలు రకమైన తోలును ముసలివాడికి ఇచ్చి, దానితో అందమైన పాదరక్షలు తయారుచేసి ఇవ్వమని చెప్పాడు. ఏ మాత్రం లోపంలేకుండా తయారు చేయాలని గట్టిగ ఆదేశించారు. వచ్చిన పని అయిన పిమ్మట ఆయన తిరిగి వెళ్లేటప్పుడు ముందులాగా గుమ్మం దగ్గర తలవంచలేదు. ఆ గుమ్మం ఆయన తలకి బలంగా తగిలింది. ఆయన బాధతో 'అబ్బా!' అంటూ తలపట్టు

కుని, అలాగే నడిచి వెళ్ళి గుర్రపు బండిలో కూర్చుని వెళ్ళిపోయారు.

విచిత్ర వ్యక్తి జమీందారుగారు బాధతో మూలిగినప్పుడు ఒకసారి తలఎత్తి చూచి నవ్వి, తిరిగి తన పనిలో నిమగ్నమైపోయాడు. జమీందారుగారు ఇచ్చిన తోలుతో బూట్లకి బదులుగా చెప్పులు తయారుచేయడం ప్రారంభించాడు. అది గమనించిన ముసిలివాడు తలబాదుకున్నాడు. జమీందారుగారు ఏ మాత్రం పొరపాటు రావడానికి వీలులేదని చెప్పినా, అంతా తారుమారు చేసాడని విచిత్ర వ్యక్తి మీద మండిపడ్డాడు. విచిత్ర వ్యక్తి మాత్రం దీనికి చలించక, తన పని చేసుకుపోసాగాడు. జమీందారుగారి జోళ్లు తయారు చేసేసాడు - ఆ కొద్ది సమయంలోనే.

జమీందారుగారి చెప్పులు తయారు చేయడం పూర్తి చేసిన కొద్ది నిమిషాలకే అవసరంగా బూట్లకి బదులుగా చెప్పులు తయారుచేసి ఇమ్మన్న కబురువచింది అది విన్న ముసిలివాడు మిక్కిలి అశ్చర్య పోయాడు. విచిత్ర వ్యక్తి మాత్రం అశ్చర్యం ప్రకటించక, నౌకరులు అడిగిన వెంటనే, తను తయారు చేసిన జోళ్లు వాళ్లకి ఇచ్చి వేసాడు. ఈ సంఘటనతో ముసిలివాడికి విచిత్ర వ్యక్తి మీద అభిమానంతోపాటు, గౌరవం కూడా కలిగి, మరింత ఆదరంగా చూడసాగాడు.

అలా కొంతకాలం గడిచింది. ఒక రోజు సాయంత్రం వేళలో ఒక స్త్రీ ఒకే లాంటి కవల ఆడపిల్లలను తీసుకుని ముసిలివాడి ఇంటికి



ఇంటిముందు అరుగుమీద కూర్చుని ఆకాశం వైపు చూస్తూ, ఏదో ఆలోచిస్తున్నాడు. వారిని చూడగానే లేచి, తన గదిలోకి వెళ్లిపోయాడు. ఆ వచ్చిన స్త్రీ ముసిలివాడితో, మూడు చెప్పులు ఒకే విధంగాను, ఒక చెప్పు మాత్రం వేరేరకంగాను తయారు చేయమని చెప్పింది. ఆ పిల్లలకు తల్లిలేదని, ఆమె చనిపోయేటప్పుడు ఆ పసిబిడ్డ కాలిమీద పడిపోవడాన్ని, ఆ లేతపాదం విరిగిపోయి, అలా వంకర పోయిందని ఆ పిల్లల గురించి కూడా ఆ ఆయా చెప్పింది. పాపం! ముసిలివాడు కూడా ఆ బిడ్డలను చూచి చాలా జాలిపడ్డాడు.

ముసిలివాడు ఆ స్త్రీని, బిడ్డలను పంపి, విచిత్ర వ్యక్తి గదిలోకి వచ్చాడు. విచిత్ర వ్యక్తి కిటికీ దగ్గర నిలబడి వెళ్ళిపోతున్న ఆ

ముసలివాడు అతని ప్రవర్తనకు ఆశ్చర్యపోయి కారణం అడిగాడు.

విచిత్ర వ్యక్తి, కన్నీళ్ళు తుడుచుకుని సంబాళించుకుని, ముసలివాడితో తన వృత్తాంతం ఇలా చెప్పాడు: "తాతా! నేను మానవ మాత్రుడిని కాను. ఇన్ని రోజులు మీ దంపతులు నన్ను ఆదరించినందుకు ఎంతైనా ఋణపడి వున్నాను. నేను యమదూతను. కనుక నాకు జమీందారుగారి మరణం సంగతి ముందుగా తెలుసును. అయనకు దెబ్బ తగులునట్లు చేసింది నా మిత్రుడే! నా మిత్రుని చూసే నేను నవ్వాను - ఆ రోజు!

ఇప్పుడు వచ్చిన బిడ్డల తల్లిని, ఆమె ప్రసవించగానే తీసుకు వచ్చేయమని మా ధర్మరాజు ఆజ్ఞ ఇచ్చారు. తీసుకు వెళ్ళడానికి వచ్చిన నేను, ఆ తల్లి బిడ్డలను ప్రేమతో అక్కున చేర్చుకొని ఆనందించడం చూసి వారిని వేరుచేయ లేకపోయాను నా కర్తవ్యం నెరవేర్చకుండానే తిరిగి వెళ్ళిపోయాను. మా ధర్మరాజు తన ఆజ్ఞను పాటించని అవిశ్వాస పాత్రుడనని, భూమిమీదకు పొమ్మని శపించాడు. నేను కాళ్ళమీదపడి వేడుకోగా, ఎవరినైతే చూచి బాధపడి వదిలేస్తావో, వారి జోళ్ళు కుట్టి, తిరిగి ఇక్కడకు వస్తావని, అప్పటికి నాకు పూర్తిగా శాప విమోచనం కలుగుతుందని అన్నారు. ఈనాటికి నా శాపం విముక్తి అయింది. ఆ కవల పిల్లల జోళ్లను క్రితం దినమే తయారు చేసాను" అని విచిత్ర వ్యక్తి ముందుగా తయారు చేసిన జోళ్లను ముసలివాడికి ఇచ్చివేసి, "ఇంకవస్తా సెలవు!" అంటూ పెద్ద మెఱుపుతో మాయమయి పోయాడు.



# గతానుగతికో లోకః

పూర్వం ఒక గ్రామంలో రామనాథశాస్త్రి అనే బ్రాహ్మణుడు వుండేవాడు. ఆ బ్రాహ్మణుడు కొంతపైకం కూడబెట్టుకొని రామేశ్వర యాత్రకు బయలుదేరాడు. తన వెంట రెండు జతల బట్టలు, ఒక చెంబు, పైకం మూటగా కట్టి అది భుజాన తగిలించుకొన్నాడు.

రామేశ్వరం చేరిన తరువాత, వెంటనే జన దొరకనందున ముందు సేతువు వద్దకు వెళ్లి స్నానంచేయ నిశ్చయించాడు. భగవద్దర్శనం చేసిన తరువాత, జన వెతుకుదామని అతని ఆలోచన! సేతువువద్దకు వెళ్ళిన తర్వాత తనవద్ద నున్న మూట ఏమిచేయాలా అనే ఆలోచన కలిగింది. ఎవరికంటా పడకుండా స్నానానికి వెళ్ళునప్పుడు సేతువుదగ్గర ఒక చోట మూటపెట్టి, పరుల కంటపడకుండా దానిమీద బాగా ఇసుక పోసాడు. ఇసుక పెద్ద కుప్పగా పోసినందున అక్కడ ఒక చిన్న ఇసుకదిబ్బ తయారయింది.

స్నానంచేసి, ఎవరికి అనుమానం కలుగకుండునట్లు ఆ ఇసుక దిబ్బచుట్టూ మూడు ప్రదక్షిణములుచేసి, రామలింగేశ్వరుని దర్శించుటకై దేవాలయంలోకి వెళ్లాడు. ఆ చుట్టు ప్రక్కల వున్న యాత్రికులు అది చూచి, రామేశ్వరం వచ్చినవారు అవిధంగా చేయవలెనేమోనని, తాముకూడా అక్కడ ఇసుకదిబ్బలు చేసి, వాటికి ప్రదక్షిణ నమస్కారాలు చేయసాగారు. ఈవిధంగా బ్రాహ్మణుడు తిరిగి వచ్చునప్పటికి అక్కడ సుమారు చాలా ఇసుక కుప్పలు తయారయినవి. అవి చూచి బ్రాహ్మణుడు తన కుప్ప యేదో తెలుసుకొనజాలక, నెత్తీ నోరూ బాదుకొని, తన మూటకై ఒక్కొక్క కుప్ప కూలదోసి వెతకసాగాడు. అక్కడ వున్న యాత్రికు లందరూ అపరాధం జరుగుతున్నదని తలచి ఆ బ్రాహ్మణుని న్యాయాధికారి వద్దకు బలవంతంగా తీసుకొని పోయారు

బ్రాహ్మణుడు యథార్థము న్యాయాధికారికి తెలుపగా, న్యాయాధికారి ఆయనకు ఇసుక దిబ్బలు త్రవ్వి, తన మూట తీసుకొనిటకు అనుజ్ఞ ఇచ్చాడు. బ్రాహ్మణుడు సేతువు వద్దకు వెళ్ళి వెతకగా తని తా మూట చివరకు దొరికింది. న్యాయాధికారి వద్దకు బ్రాహ్మణుని తీసుకొచ్చిన వారందరూ గతానుగతికో లోకః అని అనుకొంటూ, తాము చేసినపనికి నగస్తూ మరలి వెళ్ళారు.





# తగిన తీర్పు

వీరవర్మ, నాగశర్మ, విజయుడు - అనే ముగ్గురు దొంగ లుండేవారు. వీరు దొంగతనమున ఆరితేరినవారు ఇలా వుండగా ఒక అమావాస్యనాటి చీకటిలో గొప్ప విలువగల ధనాన్ని దొంగలించగలిగారు. ధనం ఎంతవుందో లెక్క ద్దామని చూడగా - ఒక వేయి సువర్ణాలు, ఎనిమిది బంగారపు వుంగరాలు, మూడు వెండి గిన్నెలను దొంగిలించగలిగారు. ఇకదాన్నిముగ్గురూ సమానంగా పంచుకోవాలి. బంగారం, వెండి - ఈ రెండింటినీ సువర్ణాలలోనికి మార్చుదామని అనుకొన్నారు. సరే, సువర్ణాలలో తెక్కించేసరికి ఏడు వందల సువర్ణాలు తూగాయి. సరేలే అని వీరవర్మ నాగశర్మకు 500 సువర్ణాలను, విజయునికి 500 సువర్ణాలను ఇచ్చేసి, తాను బంగారము, వెండి తీసుకొంటానన్నాడు. "ఇది న్యాయంగాదు. మనం సమానంగా పంచుకోవాలి!" అని పట్టుపట్టారు - నాగశర్మ, విజయుడు.

"సమానంగా పంచుకోవాలంటే, దీన్ని తీసుకెళ్లి సువర్ణాలలో మార్చాలి. అప్పుడు దుకాణాదారుడు "ఈ సొమ్ముఎక్కడిది, నీవు ఎవడవు? అని అంటే, అప్పుడు మన గుట్టు బయటబడి, వున్నది కూడా వూడిపోతుంది" అన్నాడు వీరవర్మ.

"అలైతే ఆ బంగారాన్ని, వెండిని నాకివ్వు" అన్నాడు నాగశర్మ.

"అదేం కుదరదు. దాన్ని దొంగిలించినది నేను. నాకివ్వు" అన్నాడు విజయుడు.

ఇప్పుడు ఎలా పంచుకోవాలి? - అనే సమస్య తల ఎత్తింది. అటు ప్రక్క నున్న బాటపై ఒక వ్యక్తి పోతున్నట్టు గుర్తు పట్టి, "అతన్ని పిలుచుకొని వచ్చి, అతడు చెప్పినట్టుగా పంచుకుందాము" అన్నాడు నాగశర్మ. ఇది ముగ్గురికీ శ్రేయస్కరమే అనిపించింది. 'ఇది ఎక్కడిది? - అంటే ఎట్లా?' అన్నాడు విజయుడు. "ఈ విషము ఎక్కడైనా బయటపడిందా చంపేస్తాను అని బెదిరిస్తే నోరు మూసుకుంటాడు" అన్నాడు వీరవర్మ.

ఎస్. వెంకటేశ్వర రావు, కర్నూలు-1.

సరే, ఆదారిన వెళ్లే వ్యక్తిని పిలవమన్నాడు - విజయుడు. వీరవర్మ వెళ్ళి పిలుచుకొని వచ్చి, తమ విషయమంతా చెప్పి, దీన్ని పరిష్కరించమన్నాడు.

ఆ వ్యక్తి పేరు ఆనందుడు.

"మీ అందరికీ మనిషికి 500 సువర్ణాలు ఇచ్చానను కోండి! ఇంక రెండు వందల సువర్ణాలు మిగులుతాయి. దీన్ని ముగ్గురిలో ఎవరు గొప్పవాడో తేల్చుకొని, దీన్ని తీసుకోండి!" అన్నాడు ఆనందుడు.

నేను గొప్ప అంటే, నేను గొప్ప - అని ముగ్గురూ తగువులాడుకున్నారు. వారు క్రమేణా చేతులతో పోరాడసాగారు.

"అలా కాదు. మొదట ఎవరైనా ఇద్దరు - పోరాడండి; గెలిచినవానితో తిరిగి ఇద్దరు అంటే వోడిపోయినవాడు, ఇంతకుముందు పోరాడనివాడు" అన్నాడు ఆనందుడు.

మొదట వీరవర్మ నాగశర్మ పోరాడగా, వీరవర్మ గెలిచాడు. వీరవర్మకి సందేహం కలిగింది. ఇప్పుడు ఇద్దరితో పోరాడి గెలిస్తే నాకు దక్కుతుంది; లేకపోతే ఎవరికి దక్కుతుంది? - అనుకొన్నాడు. కాని, కాస్త ఓర్పు పట్టే ఇంక వాళ్లేం గెలుస్తారులే - అనుకొని వీరవర్మ. నాగశర్మ, విజయునితో పోరాసాగారు. ఇక పోరాటం అగుట పగటి కలయే అనుకోండి!

తాము దొంగిలించిన ధనం, బంగారం, వెండి మూటలను, అనందుని వైపు ఒక్కసారి ముగ్గురూ చూచేసరికి, అనందునికి ఏం కర్మ ?- ఎప్పుడో సమయాన్ని చూసుకొని తన్నుకెళ్ళాడు.

చూచారా! ఒకరికి ఎక్కువ, ఒకరికి తక్కువ - అన్న భేదంతో వుంటే వారికి మిగిలింది కన్నీరే! అలాంటి సమయాల్లో వున్న దానితోనే తృప్తిపడాలి; లేకపోతే వున్నది కూడా వూడిపోక తప్పదు.



# రత్నాలదీవి 5

[జరిగిన కథ: రత్నాల దీవి దారి తప్పిన విజయ, విక్రములు వేరే దీవి చేరుకొని అడవి మనుష్యులను కలిసికొని, ఎంబ్రోను భైరవుడు చంపటం చూసి, ప్రయాణం చేసి రెక్కల దీవి చేరుకున్నారు.]

కాని ఒక్కటి కూడా ఫలించలేదు. అయినా, ప్రయత్నిస్తూనే ఉన్నారు.

ఆ దీవిచుట్టూ ఆకాశంలో నలుగురు రెక్కల మనుష్యులు, రెక్కల గుఱ్ఱాలపై ఎప్పుడూ తిరుగుతూంటారు. కొత్తవారు ఈ దీవి చుట్టుప్రక్కల కనిపిస్తే, వెంటనే వెళ్లి బంధించి, చెరసాలలో వేసేస్తారు.

పాతాళలోకంలో ధూమకేసరు అనే రాక్షసుడు వున్నాడు. అతడే రెక్కల రాణిని బంధించి వుంచాడు. రెక్కల రాణిని పెళ్లి చేసుకోవాలని అతడు తీసుకొచ్చాడు కానీ అందుకు రాణి సమ్మతించలేదు. అయినా, అతడు రాణిని వదలక పాతాళ గృహంలో బంధించి వుంచాడు. రెక్కల దీవిలో ఓ మూల పాడుపడిన గుహ వుంది. ఆ గుహనుండి లోకానికి వెళ్లే దారివస్తుంది. ఆ గుహ ముఖ ద్వారంలో ఓ విచిత్రమైన జంతువును రాక్షసుడు వుంచాడు. అది ఎవ్వరినీ లోపలికి పంపదు. ఆ జంతువు అంతా కోతి ఆకారంలో వుంటుంది. దాని శరీరమంతా రోమాలతో

వి. జి. వనజలక్ష్మి, మదరాసు-600013

నిండి వుంటుంది కళ్లు ఎర్రగా, అగ్నిగోళాల్లా చూపరులకు భయంగొల్పునట్లుంటాయి. నోటి నుండి కత్తులలా రెండు కోరలు బయటకు కనిపిస్తుంటాయి. అవి విషపుకోరలు!

దాని సంగతి తెలిసినవారు ఆటువైపు రారు. అది మొదటు జంతువు. దాని యజమానిని తప్ప మరెవ్వరినీ, ఆ గుహలోకి పంపదు. ఆ గుహ చుట్టు పక్కల ఎవరైనా కనిపిస్తే చంపేస్తుంది. ముఖ్యంగా దీనిని చూసి రెక్కల దీవిలోని ప్రజలు భయపడే వారు. రాక్షసుడు ప్రతిదినం ఉదయం గుహ వెలుపలికి వస్తాడు; తిరిగి మధ్యాహ్నవేళలో గుహకు తిరిగి వెళ్తాడు. అంతే, తిరిగి బయటకు రాడు.

* * * *

విజయుడు, విక్రముడు తిరిగి దారి తప్పారు. వారు రెక్కల దీవి సమీపానికి వచ్చి పడవ ఆపారు. దూరంలో వారికి దీవి చుట్టూ, ఏవో ఎగురుతు ఉండటం గమనించారు అవి ఏమిటో వారికి స్పష్టంగా తెలియక ఆ దీవి వైపు పడవను నడపసాగారు

రెక్కల దీవిపై తిరుగుతున్న ఇద్దరు రెక్కల మనుష్యులు పడవలో వస్తున్న వారిని గమనించారు. చూచిన వెంటనే ఎగురుతుంటూ వెళ్లి, ఇద్దరినీ బంధించి, రెక్కల రాజుగారి వద్దకు తీసుకు వచ్చారు.

రెక్కల రాజు వారిని చూచి "ఎవరు మీరు? ఎందుకు ఇక్కడికి వచ్చారు?" అని గద్దించాడు.

"రాజా! మేము రత్నాల దీవికొరకు వెదకుతున్నాము. దారి తప్పి మీ దీవిలోకి వచ్చాము. మమ్మల్ని వదలివేయండి. మేము వెళ్లిపోతాము" అని వినయంగా చెప్పారు.

"మేం నమ్మము. కొత్తవారిని ఈ దీవిలోకి అనుమతించము వచ్చినవారిని తిరిగి రెండు



రోజులు ఇక్కడ ఉండండి! తర్వాత ఆలో చిస్తాము" అంటూ ఇద్దరు సేవకులను పిలిచి వారి చెవిలో ఏదో చెప్పాడు.

సేవకు లిద్దరూ 'సరే'నని తలవూపి విజ యుని విక్రముని తమతో రమ్మని సైగ చేసారు. ఇద్దరూ వారి వెంట నడిచారు.

దీవినుంచి చాలా దూరం నడిచారు, ఇంకా సేవకులు ముందుకు పోసాగారు. విజయుడికి ఆశ్చర్యమేసింది. వాళ్లు ఎక్కడికి తీసుకు పోతున్నారో అర్థంకాక సేవకులను పిలిచి, ఎక్కడికి తీసుకుపోతున్నా రని అడిగాడు సేవకులు సమాధాన మీయకుండా ముందుకు పోసాగారు.

కొంతదూరం పోయాక సేవకులు ఆగి, 'మిమ్మల్ని వదలివేస్తున్నాము. మీ రింక ఎక్కడి కైనా వెళ్లొచ్చు" అంటూ వెనుకకు వెళ్లిపోయారు. విజయుడికి, విక్రముడికి ఆశ్చర్యం కనిపించింది. అంతకుముందు రాజును దీనంగా అడిగితే, కాదు పొమ్మని, ఇప్పుడు అడక్కుండానే ఎందుకు వదలి వేస్తున్నారో అర్థం కాలేదు.

"విజయా! ఇందులో ఏదో మోసం వుంది; లేకుంటే, వీళ్ళు మనల్ని ఇక్కడ వదలరు. మనం జాగ్రత్తగా మసలుకోవాలి" అని విక్రముడు హెచ్చరించాడు.

"విక్రమ్! నీవు చెప్పినది నిజమే! నేను ఆ విషయమే ఆలోచిస్తున్నాను. ముందు ఈ పరిసరప్రాంతాలు చూస్తాం తరువాత తక్కి నవి ఆలోచిస్తాము" అన్నాడు విజయుడు.

ఇద్దరూ కొంతదూరం నడిచారు. దూరంతో పాడుపడిన గుహ కనబడడంతో ఆగారు. గుహ బయట వారికి ఏమీ కనిపించలేదు. లోపల ఏమివుందో చూద్దామని ఆతృతలో ఇద్దరూ లోపలికి వెళ్లారు.

గుహ వెలుపల భయంకరమైన శబ్దం వినడంతో, ఇద్దరూ గుహనుండి బయటికి



వచ్చి చూచారు. కొద్దిదూరంలో ఓ విచిత్రమైన కోతికి, రెక్కల ఏనుగుకు భయంకరంగా యుద్ధం జరుగుతోంది. కోతి ఏనుగును కోరలతో చీల్చి చెండాడుతోంది. అంత పెద్ద ఏనుగు కోతితో యుద్ధం చేయడానికి భయపడి పరిగెత్తడం వారికి ఆశ్చర్యమనిపించింది.

కొంతసేపటిలో ఏనుగును చంపి, కోతి గుహ వైపు రావటం గమనించి, ఇద్దరూ గుహ లోపలికి వెళ్లి దాక్కున్నారు కొంతసేపు గుహ లోనే వున్నారు. తరువాత బయటికి రావాలని గుహలోనుంచి బయటకు చూసారు. గుహ ముఖ ద్వారంలో కోతి వుండడంతో, వారికి భయంవేసింది. అంత పెద్ద ఏనుగును చంపిన అది, మనుష్యులను లెక్క చేయదని వారు అకున్నారు. బయటకు రావటానికి వీలులేదు. కనుక, లోపలికి వెళ్లటానికే నిశ్చయించుకొని లోపలికి వెళ్లారు.

గుహలోపలి భాగమంతా చీకటిగా వున్నది ఇద్దరూ చీకటిలో తడుముకుంటూ వెళుతున్నారు. కొంతదూరంలో వారికి ఓ బిలం కనబడింది. క్రిందకు దిగుటకు మెట్లు కనిపించాయి. వాటిని చూడడంతో వారికి చాలా ఆశ్చర్యంవేసింది. అందులో ఎవరు వున్నారో చూడాలని ఇద్దరూ క్రిందకు దిగారు. కింద సన్నటి దారి కనబడింది. ఆ దారి గుండా మెల్లగా నడవసాగారు. కింద అంతా పాములు తిరగసాగాయి. వాటిని తప్పించుకుంటూ, ఓ గది వద్ద ఆగారు. లోపలికి తొంగిచూసారు.

లోపల ఓ భయంకరాకారుడు నిద్రపోతూ కనిపించాడు. చూడ్డానికి రాక్షసుడిలా వున్నాడు. అతని చేతిలో ఓ పెద్ద కత్తి వుండడం గమనించారు ఆ పాతాళ గృహం అతనిదే అయి వుంటుందని వారు గ్రహించారు. ఆ గది వదలి ఇంకా ముందుకు పోయారు. కొంతదూరంలో ఓ పెద్ద బండరాయి కనిపించింది. ఇద్దరూ



కష్టపడి ఆ బండరాయి తొలగించి లోపలికి తొంగి చూసారు.

ఓ అందమైన యువతి విచారంగా కూర్చుని వుండడం కనిపించింది. ఆమెకు రెండు రెక్కలు వుండడంతో, ఆమె రెక్కల దీవికి చెందినదని తెలుసుకొన్నారు. లోపలున్న యువతి కొత్తవారిని చూడడంతో ఆశ్చర్యంగా, "ఎవరు మీరు?" అని అడిగింది.

"మేము, ఈ దీవికి చెందినవారము కాము. దారి తప్పి ఈ దీవిలో అడుగుపెట్టి, ఈ దీవి రాజుగారి ద్వారా ఇక్కడికి తరిమివేయ బడ్డాము. గుహలో ఎవరుంటారో తెలియక లోపలికి వచ్చాము. ఇంతకీ మీరెవరు? ఇక్క డెందుకు వున్నారు?" అని విజయుడు అడిగాడు.

"నేను ఈ రెక్కల దీవికి రాణిని. నన్ను బలవంతంగా ఈ రాక్షసుడు బంధించాడు. దయచేసి నన్ను ఇక్కడినుంచి కాపాడి, మా రాజ్యం చేర్చండి" అని దీనంగా వేడుకుంది రాణి.

"ముందు ఈ రాక్షసుని, బయటవున్న కోతిని చంపితేగాని, మనం బయటపడలేము. వీళ్లని ఎలా చంపటం?" అని అడిగాడు విజయుడు.

"ఈ రాక్షసుని చంపగల శక్తి ఆ కోతికి తప్ప మరెవ్వరికీ లేదు. కానీ ప్రస్తుతం అది అతని పెంపుడు జంతువు. అందువలన అది అతనిని చంపదు. ఇంక ఎవ్వరికీ అతనిని చంపేశక్తి లేదు. ఈ విషయం అతడే నాకు చెప్పాడు. ఇక ఆ కోతిని చంపడం ఎవరివల్లా కాదు. అది అతడు సృష్టించింది. అతడు నాశనం అయితేగాని అది చావదు. ముందు ఆ కోతికి, రాక్షసుడికి విరోధం కల్పిస్తే, కోతి రాక్షసుని చంపేస్తుంది. ముందు ఆ విషయం ఆలోచించండి!" అని రాణి అన్నది.

"సరే, ఆ విషయం తరువాత ఆలోచిస్తాము. ముందు మేము ఇక్కడినుండి వెళ్లిపోవాలి.



లేకుంటే రాక్షసుడు నిద్రమేల్కొన్నాడంటే ప్రమాదం!" అని విజయుడు విక్రమ్ బయటికి వచ్చి బండరాతిని అడ్డంగా మూసాక, రాక్షసుడు వున్న గదికి వచ్చారు. అతడు ఇంకా నిద్రపోతున్నాడు. విక్రమ్‌కు ఓ ఆలోచన తట్టింది.

"విజయా! నాకు ఓ ఆలోచన కలిగింది. ముందు మనం రాక్షసుడి కళ్ళుపొడిచి అతనిని గుడ్డివాడిని చేసామంటే, మనం అనుకొన్నది సాధిస్తాము" అన్నాడు విక్రమ్.

"సరే" నంటూ విజయుడు విక్రమ్‌ను అనుసరించాడు.

ఇద్దరూ వేగంగా పరిగెత్తుతూ వెళ్లి కత్తులతో రాక్షసుడి రెండు కళ్లను బలంగా పొడిచారు. రాక్షసుడు కంట్లోనుండి నెత్తురు కాలువల్లా కారసాగింది. బాధకు రాక్షసుడు పెడబొబ్బలు పెట్టసాగాడు. కళ్లు తెలియక మూల మూలలా తిరగసాగాడు. అతనికి ఏమీ కనుపించక, అరుస్తూ, గది చుట్టూ పిచ్చి వాడిలా తిరగసాగాడు.

విజయుడు, విక్రముడు రాక్షసుడికి వినబడేట్లుగా పెద్దగా శబ్దం చేస్తూ గుహ బయటకు పోసాగారు. ఆ శబ్దం విన్న రాక్షసుడు శత్రువులు తప్పించుకు పోతున్నారనుకొని, తడుముకుంటూ గుహ బయటకు వచ్చి, గుహ బయట వున్న కోతిపై పడ్డాడు. ఈ హఠాత్ సంఘటనకు కోతి బెదిరి రాక్షసుని విసిరికొట్టింది. దాంతో రాక్షసుడికి కోపం వచ్చి పడిన వేగంతో వచ్చి కోతిని పట్టుకొని గిరగిరా తిప్పి నేలకేసికొట్టాడు. కోతి మరీ రెచ్చిపోయింది. అప్పుడు దానికి యజమాని అనే విశ్వాసం అంతా పోయింది. అది కోపంతో రాక్షసుడి మీదపడి విషకోరలతో అతని గుండెను చీల్చి చెండాడింది. కొంతసేపటి వరకు పోరాడి, రాక్షసుడు దాని చేతిలో మరణం పొందాడు. (ఇంకా వుంది)





# మోసానికి మోసం

ఒక గ్రామంలో రామయ్య, గౌరమ్మ అనే పేదదంపతు లుండేవారు. వారి కున్నదల్లా ఒక్క పూరిగుడిసె మాత్రమే! రామయ్య తండ్రి, తాత లందరూ ఆ గుడిసెలో నివసించినవారే! రామయ్య కాస్త మెత్తటి స్వభావం కలవాడు. గౌరమ్మ ధనికుల ఇండ్లల్లో పాచి పని చేస్తూ సంసారాన్ని సాగిస్తూ వుండేది.

ఇలావుండగా ఒకనాడు కుండపోతగా వర్షం కురుస్తోంది. రామయ్య గుడిసె తాలూకు మట్టిగోడలన్నీ వర్షానికి కూలిపోయాయి. ఇద్దరూ చెరోమూల తలదాచుకున్నారు. వర్షం వెలిశాక గోడలూ అవీ బాగుచేసుకోడానికి మొదలుపెట్టిన రామయ్య, గౌరమ్మలకు సగం కూలిపోయిన గోడలో మూత గల ఒక ఇత్తడి చెంబు దొరికింది. తెరిచి చూస్తే, దాన్నిండా బంగారుకాసు లున్నాయి. వాళ్లిద్దరి కండ్లూ జిగేలుమన్నాయి.

మర్నాడు రామయ్య కొన్ని బంగారు కాసులు తీసికెళ్లి షావుకారు అంగట్లో అమ్మ చూపాడు షావుకారుకు అనుమానం వేసింది- ముష్టి వెధవ దగ్గర బంగారుకాసు లెలా వచ్చాయా ?- అని. ఏ డెక్కడో దొంగిలించాడని గ్రామాధికారి వద్దకు తీసుకెళ్లాడు.

గౌరమ్మ ఒక శెట్టిగారింట్లో పని చేస్తూంది. ఆ శెట్టిగారు, ఆయన భార్య ఒకర్ని మించి ఒకరు పిసినారులు. ఆవిడ గౌరమ్మ దగ్గర చచ్చేటట్టు చాకిరీ చేయించుకొని జీతం యిచ్చే సమయానికి ఇంట్లో వస్తువులో, డబ్బో పోయినట్లు చెప్పి, లేని దొంగతనం అంటగట్టి, ఇచ్చే డబ్బులో సగం మినహాయించుకునేది. అంతేకాదు; ఆవిడ శెట్టిగారికి తెలియకుండా బియ్యం అవీ ఇరుగు పొరుగుకు అమ్మి డబ్బు సంపాయించేది. రామయ్య బంగారు కాసులు అమ్మజూపడం, షావుకారు అతణ్ణి గ్రామాధికారికి వప్పజెప్పడం ఎలాగో శెట్టి భార్యకు తెలిసిపోయింది.

వెంటనే శెట్టిగార్ని తీసుకొని గ్రామాధికారి వద్దకు వెళ్లింది. ఏడుపులూ, పెడబొబ్బలూ పెడుతూ, "ఆ బంగారు కాసులు నావే! ఆ ముదనష్టపు గౌరమ్మ కాజేసి, మొగుడికిచ్చి అమ్మమని చెప్పిందేమో!" అంటూ రాగాలు తీయడం మొదలు పెట్టింది.

రామయ్య, గౌరమ్మలు మాత్రం మొదలుకే మోసం రావచ్చునని అసలు విషయం బయటపెట్టలేదు. గ్రామాధికారి శెట్టి భార్యకు కాసులు యిప్పించి, రామయ్య, గౌరమ్మల మంచితనం తెలిసి వుండటంచేత బుద్ధిగా వుండమని చెప్పి పంపేసాడు.

శెట్టిగారికి మాత్రం అనుమానంగానే వుంది- తనకు తెలియకుండా తన భార్య బంగారు కాసులు ఎలా దాచిందా - అని. ఏమైనా తమ కాసులు తమకు చేరాయని తృప్తిపడ్డాడు.

గౌరమ్మ ఎలాగైనా శెట్టిగారి భార్యపై పగ తీర్చుకోవాలనుకొంది. తమ దగ్గర యింకా ఇత్తడి చెంబులో మూడొవ్వు భాగం పైగా బంగారు కాసులు వున్నాయి. వాటిని ఎలాగయినా వదిలించుకోవాలి. ఆలోచించగా గౌరమ్మకు ఓ ఉపాయం తట్టింది.

గౌరమ్మ ఆ రోజు శెట్టిగారింట్లో పనిచేసి ఆవిడ ఉతకమని యిచ్చిన బట్టలుపట్టు కొచ్చేసింది. చీకటి పడ్తూండగా గౌరమ్మ ఆ చీర కట్టుకొని, కాసుల చెంబును కొంగులో



దాచుకొని షావుకారింటికెళ్లి తలుపుతట్టింది. గౌరమ్మ ఇంచుమించు శెట్టి భార్య అంత పొడవు కల్గి వుంటుంది. దానికితోడు మొహం కనిపించకుండా ముసుగేసుకొని వచ్చింది.

షావుకారు ఆమె శెట్టిగారి భార్యేనని లోపలికి పిలిచి, సంగతి ఏమని అడిగాడు. ఆవిడ తన దగ్గరున్న కాసుల చెంబు బయటపెట్టి, "శెట్టి గారు ఈ కాసు లన్నిటికీ వెలకట్టి డబ్బు తీసుకు రమ్మన్నారు!" అని చెప్పింది.

బంగారు కాసులు చూడగానే షావుకారు మొహం వికసించింది. గబ గబా వెలకట్టి డబ్బు ఆమె వళ్లో పోసాడు.

డబ్బు తీసుకొని బయటపడ్డ గౌరమ్మ తెల్లారేసరికి ఆ చీరను శెట్టిగారింట్లో చేరే

సింది. తనకు వంట్లో సరిగాలేదని, వారం రోజుల వరకూ రానని చెప్పి వచ్చేసింది

శెట్టిగారు, షావుకారు మంచిస్నేహితులు. ఒకనాడు శెట్టిగారు షావుకా రింటికి వెళ్లారు. మాటల్లో షావుకారు, "ఏం! శెట్టిగారూ! ఆ రోజు డబ్బంతా సరిపోయినట్లేనా? లెక్కలో తప్పులేదు కదా!" అని అడిగాడు. శెట్టికి అర్థం కాలేదు. "ఏంటయ్యా! అలా తెల్ల మొహం వేస్తావు? మీ ఆవిడ చెంబెడు బంగారు కాసులమ్మి డబ్బు ఇమ్మంటే ఇచ్చాను కదా!" అన్నాడు మరల షావుకారు.

శెట్టిగారికి మొట్టమొదట పట్టుకొన్న అనుమానం నిజమైంది. దీని దగ్గర చెంబెడు బంగారు కాసులున్నా యన్నమాట ఇంత వరకు నాకు తెలియకుండా దొంగతనంగా అమ్మిం దన్నమాట! దీని అంతేదో ఇవాళ తేల్చాలని ఇంటికెళ్లాడు.

అదే సమయానికి శెట్టి భార్య పారుగింటమ్మకు రెండు శేర్ల బియ్యం అమ్మి డబ్బు లెక్కపెట్టి రొంటిన దోపుకుంటున్నది. ఈ విషయం శెట్టికి తెలియదు. ఉగ్రరూపంలో ప్రత్యక్షమయ్యేసరికి తను దొంగతనంగా బియ్యం అమ్మిన సంగతి తెలిసిపోయిందని వణకసాగింది. శెట్టి ఆవిడను జుట్టుపట్టుకొని 'ఇంకా ఎన్ని విషయా లిలా రహస్యంగా జరుగుతున్నాయి? మర్యాదగా చెప్పు!" అంటూ చావబాదాడు. తాను చాటుగా వస్తువు లమ్మడం పారబాటేనని గోల పెట్టింది. కోపంతో ఆవిడను ఇంటినుండి తరిమేశాడు.

గౌరమ్మ, రామయ్య తమ యుక్తి పారినందుకు సంతోషించారు వారు బంగారు కాసులు అమ్మగా వచ్చిన పై డబ్బును తీసికొని ఆ గ్రామం వదలి, ప్రక్క గ్రామానికి వెళ్ళి మంచి ఇల్లు కట్టుకొని, చుట్టుపక్కల పొలాలు తీసుకొని, దాన్ని సాగు చేసుకుంటూ హాయిగా కాలం గడపసాగారు



# పక్షులు పలువిధాలు





'లాప్ వింగ్' అనే ఒక పక్షి మొసలి నోటిలో కూర్చొని, దాని పళ్లసందుల్లో వున్న పాచీ, యితర చెత్తాచెదారాన్ని తన ముక్కుతో పొడిచి తింటుంది. విచిత్ర మేమిటంటే ఈ పక్షిని మొసలి ఏమీ చేయదు. నోరు తెరిచి అలాగే వుంచుతుంది.



మరో రకం గుడ్ల గూబ పక్షి తన గూటి వేపు మరో పక్షి జాతి రావడం గ్రహించిందంటే, గ్రుడ్ల మీద వెల్లికిలా పడుకొని, కాళ్ళు పైకెత్తి కాళ్ళ గోళ్ళతో పగవార్ని పైసల్ చేయటానికి రెడీగా వుంటుంది.



నిప్పుకోడి గ్రుడ్లను రాత్రిళ్లు మగ కోడి, పగలు ఆడ కోడి పొదుగుతాయి.

పక్షుల్లో నే అధిక యీకలు గల పక్షి శ్వేత "శబ్దహంస" ఒక్కటే! దీనికి 25,216 ఈకలు వున్నట్లు లెఖ్ఖపెట్టి చూశారట! (ఇంక కోళ్లకు సుమారు 8,300 ఈకలు వుంటాయట!)



కివి జాతి పక్షుల్లో ఆడపక్షి గ్రుడ్లు పెట్టడంతోసరి; ఆ గ్రుడ్లను పొదిగి పిల్లన్ని సంరక్షించటం మగ కివిపక్షి బాధ్యత. ఆ పక్షి గ్రుడ్లుపెట్టడం అయిపోయాక, ఆ గ్రుడ్ల వైపుకి కూడా రానీయదు మగ కివిపక్షి.



గుడ్లగూబల్లో ఆడ గుడ్లగూబలు పెట్టే గ్రుడ్లను, మగ గుడ్ల గూబా, ఆడ గుడ్ల గూబా- రెండూ ప్రక్క ప్రక్కన కూర్చొని ఇంక గ్రుడ్లు పొదుగుతాయి.



# లేడి, తాబేలు, వడ్రంగి పిట్ట

బ్రహ్మదత్త మహారాజు కాశీరాజ్యాన్ని పరిపాలిస్తున్న రోజులవి. బోధిసత్త్వుడు లేడిగా అవతరించి, ఒక అడవిలో నివసిస్తూ ఉండేవాడు. అతని నివాస మొక దట్టమైన పొద. దాని దగ్గర చక్కని సరస్సు ఒకటి ఉండేది. ఆ సరస్సు గట్టుమీద ఒక చెట్టు పైన గూడుకట్టుకొని వడ్రంగి పిట్ట ఒకటి కాపుర ముండేది. ఆ సరస్సులో తాబేలొకటి నివసిస్తూ ఉండేది. ఈ ముగ్గురూ ప్రాణస్నేహితులై హాయిగా జీవిస్తూ ఉండేవారు.

ఒకనాడు వేటగాడు పన్నిన వలలో బోధిసత్త్వుడు చిక్కుకున్నాడు. అది అతని మిత్రులు గమనించారు. వడ్రంగి పిట్ట తాబేలుతో "మిత్రమా! నీకు పళ్ళు ఉన్నాయి. ఈ వల తోలు తాళ్లతో చెయ్యబడింది. నీవు దీనిని కొరుకుతూ ఉండు. నేను వెళ్లి వేటగాడు ఆలస్యంగా వచ్చేటట్లు చేస్తాను" అని చెప్పింది. తాబేలు వల కొరకటం ప్రారంభించింది.

వడ్రంగి పిట్ట ఎగిరి ఎగిరి వేటగాడి ఇల్లు చేరింది. అతడు చీకటి ఇంకా తగ్గకముందు లేచి కత్తీ, బుట్టా చేతబుచ్చుకొని, తలుపు తెరచుకొని అడవికి బయలుదేరబోయాడు. వాకిటి ముందు వేచివున్న వడ్రంగి పిట్ట గబుక్కున ఎగిరి, రెక్కలు రెపరెప లాడించి వేటగాని ముఖానకొట్టి పైకెగిరింది. ఏదో చెడ్డ పక్షి ముఖంమీద కొట్టిందనీ, అది మంచి శకునం కాదనీ భావించి ఇంట్లోకి తిరిగి వెళ్లి కొంతసేపు పడుకున్నాడు.

మళ్లీ కొంతసేపటికి వేటగాడు లేచి కత్తీ, బుట్టా తీసుకున్నాడు. వాకిట ద్రోవలో పోతే మంచి శకునం కాలేదు. దొడ్డి ద్రోవను పోదా

(బౌద్ధ జాతక కథ)

మనుకున్నాడు. దొడ్డి తలుపు తెరిచాడు. వడ్రంగి పిట్ట ఇది గ్రహించింది. అటు ప్రక్కకు వెళ్ళి రెక్కలు రెప రెప లాడిస్తూ వేటగాడి తలమీద కాళ్లతో గీసి, రెక్కలతో కొట్టింది. రెండోసారి కూడా దుశ్శకున మైందని వేటగాడు చింతించి, ఇంట్లోకి వెళ్లి మళ్లీ కొంతసేపు పడుకున్నాడు. సూర్యోదయ మైన తర్వాత బయలుదేరదామనుకున్నాడు.

వడ్రంగి పిట్ట ఎగురుకుంటూ అడవికి తిరిగి వచ్చింది. తాబేలు తన చిన్న పళ్లతో తోలు వార్లను కొరకడానికి చాలా కష్టపడుతున్నది. పళ్ల వెంట రక్తం కారసాగింది. అయినా మానివెయ్యక కొరుకుతూనే ఉన్నది. దూరాన్నుంచి వేటగాడు వడివడిగా వస్తున్నాడు. వడ్రంగిపిట్ట అది చూచింది; మిత్రుల్ని హెచ్చరించింది. అప్పటికి వల వార్లను చాలాభాగం తాబేలు కొరికివేసింది. ఇంకా ఒకటి మాత్రం ఉన్నది. దాన్ని కొరికే సమయం లేదు. లేడి తన బలంకొద్దీ లాగింది. వల పూర్తిగా తెగిపోయింది. లేడి దూరంగా పరుగెత్తి పోయింది. వేటగాడు కొంచెం దూరంనుండి చూస్తూనే ఉన్నాడు.

తాబేలు అలసిపోయి అక్కడనే పడుకున్నది. కదలలేక పోయింది. వేటగాడు దాన్ని చూచి పట్టుకుని బుట్టలో వేసుకున్నాడు. ఇదంతా వడ్రంగిపిట్ట చూచింది. ఎగిరి వెళ్లి లేడికి చెప్పింది. ఇద్దరూ ఆలోచించారు; ఒక పథకాన్ని పన్నినారు.

వేటగాడు వచ్చే త్రోవలో లేడి చాలా బలహీనంగా ఉన్నట్లు, లేవలేనట్లుగా పడుకున్నది. వేటగాడు దానిని సమీపించే సమయాన వడ్రంగిపిట్ట కూతకూసింది. లేడి గబుక్కున లేచి దౌడు తీసింది.

లేడి పారిపోవడం చూచి వేటగాడు తెల్లబోయి చూస్తూ ఉన్నాడు. ఇంతలో వడ్రంగిపిట్ట వేటగాని బుట్ట దగ్గరకువచ్చి తన కాలి గోళ్ళతో బుట్టను బోర్లించగా తాబేలు బయటకు వచ్చి సరస్సులోని నీళ్లలోకి వెళ్లి పోయింది. వేటగాడు నిరాశతో వెళ్లిపోయాడు.

వాడికి లేడి దక్కలేదు; తాబేలు దక్కలేదు. మంచి మైత్రివలన ఈ ముగ్గురూ ఆపద నుంచి తప్పించుకున్నారు.



# వింతలు-విశేషాలు



వేపాకు బాగా రెండు పిడికెళ్ళు కోసుకొచ్చుకొని రాత్రి పడుకోబోయే ముందు బాగా కాగిన వేడి నీటిలో ఆ వేపాకును వేసి వుంచి తెల్లవారి లేచి నీటిలో నుంచి వేపాకు తీసి పారవేసి, ఆ నీటితో బాగా ముఖం కడుక్కుంటే ముఖ మొటిమలు పోతాయి



ఆఫ్రికాలో వర్ణ భేదం మార్పుకోసం, వర్ణ విచక్షణ నిర్మూలనకొరకు కొంతకాలానికి ముందు తెల్లవారికీ, ఆఫ్రికావారికీ కలిపి స్నానంచేయటానికి ఒకే కోనేరును ఆరోగ్య సంస్థవారు నెలకొల్పారు. ఇప్పుడు మరో క్రొత్త పద్ధతి ప్రవేశపెట్టారక్కడ. తెల్లవాడైనాసరే, నల్లవాడైనాసరే హంతకులు, యితర పెద్ద నేరస్థులు ఒకేచోట, ఒకే వేదిక మీద ఉరితీయబడతారు.



దక్షిణాఫ్రికాలోని ఆన్డిస్ కొండ ప్రాంతంలో తనకు తానుగా భూమిలో పుట్టింది విచిత్రాకారం గల వుర్లగడ్డ. 1538 లో ఈ వుర్లగడ్డను మానవాహారంగా కనుగొన్నారు - ఈ ప్రాంతీయులు ఆ తరువాతనే క్రమేణా ప్రపంచ వ్యాప్తమైంది.



సముద్రంలో 'సీలు' అనే ఒక చేప వుంది. ఇది గర్భం ధరించిందంటే, మూడు మాసాల వరకూ-అంటే ప్రసవించే వరకూ - ఆహారాన్ని బొత్తిగా స్వీకరించదట! ప్రసవించాకనే మరల ఆహారాన్ని తీసుకోవటం మొదలుపెడ్తుంది.




# కళాపూర్ణోదయుని గాథ 4

జరిగిన కథ: నారద మునీంద్రుడు కలభాషిణిని ఆశీర్వదించి వెళ్లాడు. ఆమె మణిస్తంభుడను సిద్ధపురుషుడు దర్శన మిచ్చాడు ఆయన ఆశీర్వదించి వెళ్లాడు. ఇక చదవండి—

ఇదివరకు తుంబురునితో వచ్చిన తగాదాను దేవేంద్ర సభలో గాని, బ్రహ్మదేవుని సభలో గాని, కైలాసంలో గాని, వైకుంఠంలో గానీ తీర్చుకోవాలి' అని చెప్పాడు.

ఆ మాటలు విని మణికంధరుడు 'మహా మునీంద్రా! మీకు తుంబురుని జయించవలెనని తీవ్రేచ్ఛ ఉన్నట్టున్నది అయనతో తగాదా ఎందుకు వచ్చింది? ఇదివరకు ఆయన్ను జయించడానికి ఏమి పాట్లు పడ్డారు? దయచేసి నాకు ఆ కథ చెప్పండి' వినాలని కుతూహలంగా ఉన్నది"అని ప్రార్థించాడు. నారద మహాముని "నీకు అంత కుతూహలంగా ఉంటే చెప్పుతాను విను" అని చెప్ప సాగాడు

"వైకుంఠంలో ఒకనాడు శ్రీమహావిష్ణువు మహాసభలో కూర్చుని ఉన్నాడు. ఆయనను బ్రహ్మాది దేవతలు సేవిస్తూ ఉన్నారు యోగీశ్వరులు వేదఘోష చేస్తూ ఉన్నారు. కౌండిన్య, అత్రి మరీచి, దక్ష కపిల, అగస్త్య, అక్షపాద, అంగిరస, శాండిల్య, క్రతు, కణ్వ, కుత్స,

భృగు, విశ్వామిత్ర, మైత్రేయ, మార్కండేయ, అసురి, వామదేవ, కపి, దుర్వాసోఋషి, ఐక, వ్యాఘ్రపాద, మాండవ్యాది మహామునులు శ్రీ మహావిష్ణువును సేవించడానికి వచ్చి ఉన్నారు. వీణాధరులమైన నేను, తుంబురుడు విశ్వావసుడు కూడ భక్తితో ఆయన సేవకుగాను వెళ్లి ఉన్నాము. దివ్యవారాంగనా నాట్యాన్ని అవలోకిస్తూ దేవదేవుడు కొలువు కూటంలో ఉన్నాడు. విష్వక్సేనుడు బెత్తము పట్టుకుని సందడి లేకుండా చూస్తున్నాడు.

ఆ సమయంలో కొలువు కూటమునకు ఎదురుగా ఉన్న శృంగారపు తోటలో నుంచి చెలికత్తెలతో కలసి మహాలక్ష్మి వచ్చింది. ఆమె తోటలో నుంచి సరిగా బయటకు వచ్చినదో లేదో కానీ, సేవకులు వచ్చి సభలో ఉన్నవారి నందరినీ బయటకు వెళ్లగొట్టారు. మావంటి వారి సంగతి చెప్పవలసిన పని యేముంది? బ్రహ్మదేవుణ్ణే బయటకు పంపించివేశారు. సభాజనమంతా బయటకు వచ్చి, దూరదూరంగా నిల్వబడినారు. అంతలో లోపల నుంచి సేవకు డొకడు వచ్చి, "ఓహో! తుంబురుడా!" అని పిలచి, తుంబురుణ్ణి లోపలకు తీసుకుపోయాడు.

'తుంబురుణ్ణి మళ్లా లోపలికి ఎందుకు పిలిపించి ఉంటారు?'' అనేవాళ్లు కొందరు. "గానవిద్యావిషయంగా ఏమైనా ప్రసంగము జరుగుతున్నదేమో!" అనేవాళ్లు కొందరు. "ఇంత కంటె సంగీత చతురులు లేరా?" అనేవాళ్లు కొందరు. ఇట్లా ఎవరికి తోచినట్లు వాళ్లు అనుకుంటున్నారు - జనం. నామట్టుకు నేను "ఇప్పుడు తుంబురుణ్ణి ఎందుకు పిలిపించినట్లు?" అని మనస్సులో వితర్కించుకుంటూ ఉండగా, లోపలినుంచి బయటకు వచ్చిన సేవకులు చెప్పిన మాటలు: "పురుషోత్తముడు అమ్మవారితో కలసి తుంబురుని గానము వింటున్నారు" అని వినిపించాయి.



మమ్మందరినీ బయటకు పంపించి, శ్రీహరి లక్ష్మీదేవితో కలసి తుంబురుని గానం వింటు న్నందుకు నాకు మనస్సులో బాధకలిగింది. "తుంబురుడు బయటకు వచ్చినతరువాత ఇంకా సంగతులు తెలుస్తాయి కదా!' అని నేను వేచి ఉన్నాను. కొంతసేపటికి తుంబురుడు బయటకు వచ్చాడు. జనం అతని చుట్టూ మూగారు. "శ్రీమన్నారాయణుడు ఏమి బహుమతి ఇచ్చి పంపించాడు ?' అని ప్రశ్నించేవాళ్లు కొందరు. "సర్వేశ్వరుడు మహాలక్ష్మీదేవితో కలసి గానం విన్నాడు. ఇంకా ఏమి అవ్వాలి ?' అనేవాళ్లు కొందరు. "అట్లా పిలిపించి గానం వినడమే గొప్ప అనుగ్రహం!'' అనేవాళ్లు కొందరు. "అక్కడ నీవొక్కడివేనా? ఇంకెవరైనా ఉన్నారా ?'' అని అడిగేవాళ్లు కొందరు. ఇట్లా దేవతలు, మునులు మాట్లాడుతూ వెంటపడగా తుంబురుడు నూతనమైన తేజస్సుతో ముందుకు నడిచాడు.

ఏదో శరీరానికి క్రొత్తగా పూసుకున్నట్లుగా ఉన్నది. గొప్ప మాణిక్య పతకాన్ని ధరించి ఉన్నాడు. అద్భుతమైన నూత్న దివ్యవస్త్రాన్ని ధరించి ఉన్నాడు. ధగధగలాడే అతని పతకానికీ, నిగనిగలాడే దివ్యవస్త్రానికీ, బుగ బుగమనే మైపూతకూ నా మనస్సు భగభగమండింది

మేమిద్దరమూ ఎంతోకాలంనుండి ప్రాణ స్నేహితులం; కలసి ఉంటున్నాం; కలసి గానంచేస్తున్నాం; జంట కవులులాగా మేము జంటపాటకుల మనిపించుకుంటున్నాం. అటువంటప్పుడు తుంబురుడు తనకు పిలుపువస్తే మటుకు నాతో చెప్పకుండా లోపలకు వెళ్ల వచ్చా ? ఒకవేళ లోపలకు వెళ్లినా, లోపల నుండి నన్ను పిలిపించకుండా తానొకడే విద్యాప్రదర్శనకు పూనుకోవచ్చా ? ఒకవేళ విద్యాప్రదర్శన చేసినా, బహుమానం తీసుకునేటప్పుడైనా నన్ను జ్ఞాపకం చేసుకోవద్దా ?"



అనుకుంటూ నా మనస్సులో నేను కోపంతో తుంబురుని మీద పళ్లు పటపట కొరికి లోలో పల నేను ఉడికిపోయాను.

"ఏమం నాకంటె ఘనుడా ? ఏ నాటికి ఎప్పటి కైనా గర్వభంగం చేస్తాను. గానవిద్యలో తన కంటె అధికుడనని ఋజువుచేస్తాను" అని మనస్సులో నిశ్చయించుకున్నాను. అతనితోడ ఎక్కడనైనా వివాదంపెట్టుకుని ఓడించి, నా సంగీత చాతుర్యవార్తలు ఈ జగన్నాయకునికి వినబడేటట్టు ఉపాయం పన్నుతాను" అని ఊహించాను. నా ఈర్ష్య బయటపడకుండా తుంబురునితో మామూలుగానే పూర్వస్నేహాన్ని నటిస్తూ కొన్నాళ్లు గడిపాను. 'అతనిని జయించాలంటే అతని గానవిద్యలో గుణదోషాలు తెలుసుకోవటం నీతికదా!' అని గ్రహించాను.

ఒకనాడు నేను తుంబురుని నివాసానికి వెళ్లాను. అతడు సంగీతసాధనకు సిద్ధపడుతూ, తన వీణను అయుత్తంచేసి ఉంచి తాను ఎందుకో లోపలకు వెళ్లాడు. నేను ఆ వీణను తీసుకుని పలికించి చూచాను. అపూర్వమైన శ్రుతుల పెంపు, అతులమైన దాని నిర్దోషత నాకు ఆశ్చర్యాన్ని కలిగించినై. అతని శక్తి సామర్థ్యాలకు నాకు సిగ్గువేసింది. వీణను అక్కడనే పెట్టి, నేను తిరిగి వచ్చేశాను. 'గాంధర్వవిద్యలో జగద్విఖ్యాతి పొందిన నాకంటె తుంబురు డధికుడని నాకిప్పటిదాకా తెలియనైకదా!' అనుకున్నాను. 'తాటిచెట్టు తలను తన్నేవాడి తల తన్నేవాడు ఉంటా'డనే సామెతకు ఇది నిదర్శనం కాబోలు అనుకున్నాను.

ఇంతకుముందు మే మెన్నిసార్లో దేవేంద్రుని ముందు, బ్రహ్మదేవుని సభలోనూ కలిసి పాడినాము. అప్పు డెప్పుడు తనకింత గాన విద్యాసంపద కలదని బయటపెట్టలేదు. ఇప్పుడు శ్రీమహావిష్ణువు ప్రసన్నుడై తన్ను పిలిపించేటప్పటికి విద్యాసంపదను వెళ్లడి



చాడు. ఎదురుగుండా ఉన్నవారు ఎంతవరకు గ్రహించగలరో అంతవరకే విద్యను ప్రదర్శిస్తారు-ఉత్తములు. నీరు కొలది తామర-అంటే ఇదే కాబోలు! అంతేకాని, ఎదురుగా ఉన్న వాళ్లకు అర్థముకాని విద్యారహస్యాలు ప్రదర్శించడం 'చెవిటివాని ముందు శంఖం ఊదినట్లే' 'గాడిదముందు కవిత్వం వినిపించినట్లు' కూడాను.

ఆనాటినుండి తుంబురుని జయించాలని తీవ్రాభిలాష కలిగి, పెరుగజొచ్చింది. ఎక్కడెక్కడ గానవిద్యావేత్త లున్నారని తెలిస్తే, అక్కడక్కడకు వెళ్లి వాళ్లదగ్గర రహస్యాలు తెలుసుకోసాగితినే గాని, ఎన్ని నేర్చుకున్నా తుంబురునితో సమానం కాలేకపోయాను. ఇట్లా చాలాకాలము గడచింది. తుంబురుని గాన విద్యలో నేను జయించాలంటే, పుండరీకాక్షుని అనుగ్రహం సంపాదింపవలసి ఉంటుందని నిశ్చయించుకుని, ఆ దేవదేవుని గురించి చిరకాలము తపస్సు చేశాను. నా మీద కరుణించి ఆయన శ్రీ మహాలక్ష్మీదేవితో కలసి నాకు ప్రత్యక్షమై, కావలసినవరం కోరుకొమ్మన్నాడు. నేను నా శక్తికొలది ఆయనను స్తుతించి, 'తుంబురుణ్ణి గానవిద్యలో నేను ఓడించాలి' అన్నాను

శ్రీమన్నారాయణుడు కరుణతో చిరునవ్వు నవ్వి, "నేను ద్వాపరయుగంలో వసుదేవుని కుమారుడనై జన్మించి, దుష్టజనశిక్షణము శిష్టజన రక్షణము చేస్తాను అప్పుడు నీవు ద్వారక అనే పేరు గల పట్టణానికి రా! నీ కోరిక తీరుస్తాను" అని చెప్పి అంతర్ధానమైనాడు అప్పటినుంచి నేను చిరకాలం వేచిఉన్నాను. ఇప్పుడు నా కోరిక తీరింది. నేను యిన్ని పాట్లు పడి యీ గాన మహిమను పొందాను. శ్రీహరి కరుణవలన నీవున్నూ, కలభాషిణి యున్నూ శ్రమలేకుండా పొందగలిగారు" అని నారద మునీంద్రుడు వివరించాడు.



అప్పుడు మణికంధరుడు 'మహాత్మా! మహాతపోధనులైన మిమ్మల్ని సేవించిన పుణ్యవిశేషంచేత మా కిది లభించింది. 'తన్ను అందుకున్నవారు తనంతవారు' అన్న సామెత మీరు వినే ఉంటారు. దానికేమిగాని, ఒకసారి తుంబురుణ్ణి పిలిపించి, శ్రీమన్నారాయణుండు పాట వినడం గొప్ప పూజ్యమైన దిగా మీరు చెప్పారు. ఎల్లప్పుడూ వైకుంఠంలో వసించి, ఆ దేవదేవుణ్ణి సేవించుకొనగల్గు భాగ్య మెట్లాలభిస్తుంది?" అని అడిగాడు. నారద మునీంద్రుడు సంతోషంతో "మణికంధరా! నీవు నిజంగా ఘనుడవు. ఇటువంటి సద్బుద్ధి నీకు తప్ప వేరెవ్వరికైనా ఉన్నదా? లోకంలో అంతా పాపం పుణ్యం, విధి నిషేధం, కీడు, మేలు, పరలోకం - అనే విషయాలు వింటున్నారు. ఆయితేనేమి? ఆత్మహితాన్ని గురించి నీవలె తలపరు.

ఎన్ని వేదాలు, శాస్త్రాలు చదువుకున్నా, ఎంత ప్రఖ్యాతి పొందినా - 'చెట్టి తీసింది. రోకలి తలకుచుట్టమన్నట్లు'గా లోకంలో ధనార్జనకు బయలుదేరుతారు. అన్ని భూతములలో ప్రాణు లుత్తమములు. ప్రాణులలో బుద్ధి జీవులు మేలు. బుద్ధి జీవులందు మనుజులు శ్రేష్ఠులు. వారిలో అగ్రజన్ములు అధికులు. వారిలో విద్వాంసులు. వారిలో విద్యయొక్క అర్థాన్ని అనుసంధానం చేసినవారు ముఖ్యులు. అట్టివారిలో కర్తలు. వారిలో బ్రహ్మవిదులు. ఆపైన పరమ మొక్కటి కలదని మనువు మునుపు చెప్పాడు. నీవు కోరినట్లు అనవరతమూ దేవదేవుని సాన్నిధ్యంలో ఉండగలిగే మహత్త్వాన్ని పొందే ఉపాయం పెద్దల వలన విన్నదాన్ని నీకు చెప్పుతాను.

అధికారి కానివానికి అధిక పదవిని గూర్చి చెప్పడం తప్పు; అధికార యోగ్యత ఉన్న వానికి చెప్పకపోవడం కూడా తప్పే. కాబట్టి యోగ్యత ఉన్ననీకు చెప్పుతాను. (ఇంకావుంది)



#  ఒకనాడేమయిందో తెలుసా? 

ఫిబ్రవరి 14న నేనూ, ఫ్రెండూ కలిసి సికింద్రాబాద్ వెళ్ళాం. అక్కడ అరుణ్ణ దయినా సూర్యోదయం కాకపోవడం మా కాశ్చర్యాన్ని కల్గించింది.

ఆ రోజు అలసట వల్ల సాయంత్రం ఆరు గంటలకే నిద్రపోయాం-వేకువ జామున మా లాడ్జి క్రింద నున్న హొటల్‌లో గ్లాసుల గల గలలు, మోటారు వాహల హారన్లమోత, ప్రక్క నున్న బాత్‌రూంలో నీళ్ల చప్పుళ్లతు... నాకు మెలుకువ వచ్చేసింది...టేబులేపై నా రిస్టువాచీ చూశాను...6-20 అయింది! గబ గబా కాలకృత్యాలు తీర్చుకొని, స్నానం చేసి, డ్రెస్ కూడా చేసేసుకున్నాను. నా ఫ్రెండ్ అతి కష్టంమీద లేచి, అలవాటుగా 'బెడ్‌టీ'కి బైటకెళ్ళాడు. వెంటనే తిరిగి వచ్చి, నవ్వ లేక నవ్వుతూ ఒరేయ్! ఇపుడు టైం ఒంటి గంటయింది' అన్నాడు- నా డ్రెసేకేసి చూస్తూ...ఆశ్చర్యంగా వాచీ వంక చూశాను- 6-20 వద్ద ఆగిపోయివుంది!

—ఎం. జి. మూర్తి, విశాఖపట్నం 530008.

ఒకనాడు నేను స్కూలుకు వెళ్తుండగా బెల్‌బాటమ్ పాంటు, షర్టు వేసుకొని ఒకత నెదురయ్యాడు. అతని చేతికి ఒకవాచీ వున్నది. సరదాగా టైమెంత? అని అడిగాను. "పళ్ళూడుతాయి!" అనివెళ్లిపోయాడు. తర్వాత మా ఫ్రెండ్‌ను అడిగితే, ఆ వాచీగలవాడికి టైము చూడ్డంరాదుట! ఆ దగ్గా టైమెంత అని ఏడిపిస్తారుట! నేను కూడా అలా నెక్కిరించా ననుకొని నన్ను తిట్టాడుట! మొదట, ఏడు పొచ్చినా, తర్వాత నవ్వొచ్చింది నాకు.

—హెచ్. ఆర్. సి మూర్తి, అందలూరు.

ఒక రోజు నేను మా బంధువుల అబ్బాయి పెండ్లికి వెళ్లాను. పెండ్లి వైభవంగా జరిగింది. తరువాత అంతా కబుర్లలో పడ్డాము. చాలా రోజుల తరువాత కన్పించిన మా దూరపు బంధువును "ఏమండీ! బాగున్నారా?" అని పలుకరించాను. "అం ఏదో మీదయవల్ల బాగానే ఉన్నానండీ!" "మీ వ్యాపారం బాగా నడుస్తున్నదా?" అన్నాను. "ఏదో మీదయవల్ల బాగానే లాభాలొస్తున్నాయండీ!" అన్నాడాయన...'అన్నట్లు...పిల్లలెంతమంది?' అన్నాను. "ఏదో మీదయ..." అని టక్కున ఆగిపోయాడు అక్కడున్న వాళ్లందరూ గొల్లున నవ్వారు పాపం! ఆయన వెంటనే అక్కణ్ణుంచి లేచిపోయాడు. ఇది జ్ఞాపకం వచ్చినప్పుడల్లా మేము నవ్వుతూనే ఉంటాము.

—రాయపుడి పురుషోత్తమరావు బి. కామ్-1 దోనెకల్లు.




# ఇది కూడా నాటకమే

రామాపురం అనే గ్రామంలో శివయ్య అనే వైద్యుడు ఉండేవాడు. అతను రోగులందరికీ చాలా చక్కగా వైద్యం చేసేవాడు. అతని పేరు చుట్టు ప్రక్కల గ్రామాలకు కూడా ప్రాకింది. అనేకమంది అతడి దగ్గరకు వైద్యం కొరకు వచ్చేవారు. అవసరానికి మించిన ఐశ్వర్యమూ, అనుకూలవతి అయిన భార్యా ఉండటాన్ని ఆయన జీవితం చాలా కాలంపాటు ఆనందంగా గడిచింది. లేక లేక కొడుకు పుట్టి, వాడు అల్లారుముద్దుగా పెరగటం ఆరంభమయ్యేసరికి ఆయనకు పెద్ద సమస్య ఎదురయింది.

శివయ్య కొడుకు నాగన్న చిన్నతనం నుండి కూడా పెంకెఘటం. చిన్నపిల్లవాడు గదా అని శివయ్య వాడి విషయం కొంత కాలంపాటు ఉపేక్షిస్తూ వచ్చాడు. కాని, వయస్సు వస్తున్నకొద్దీ నాగన్న కొరకరాని కొయ్య అయిపోయాడు. ఎవరి మాటా వాడికి లక్ష్యం లేదు. యుక్త వయస్కుడయ్యాడు గాని వాడి కింకా ఓనామాలైనా రాలేదు. వాడి ధ్యాస ఆటలపైనుండి చదువుమీదికి మళ్ళించటానికి శివయ్య ఎన్నో ప్రయత్నాలు చేసాడు. వాణ్ణి కూడా తనలాగా గొప్ప వైద్యుణ్ణి చేయాలనుకున్నాడు కాని, లాభం లేకపోయింది.

నాగన్నకు మెల్లి మెల్లిగా తాగుడూ, జూదములాటి దురలవాట్లు పట్టుకున్నాయి. ఇలా దుర్వ్యసనాలకు బానిస అయినా, నాగన్న బుద్ధి చెడ్డది కాదు. వాడికి తండ్రి మీద ప్రేమ కూడా వున్నది. కాని, తండ్రి హితబోధలు వాడి చెవికి ఎక్కలేదు. ఒక్కగానొక్క కొడుకు కావటాన వాణ్ణి శివయ్య ఏమీ అనలేదు. వాడి భవిష్యత్తు గురించిన ఆలోచనలతో ఆయనకు తీరని బెంగపట్టుకున్నది.

ఒకనాడు ఎటూ తోచక అతను తిన్నగా పూర్వపు ఆ గ్రామ వైద్యుడగు కోదండయ్య దగ్గరకు వెళ్ళి, తన విషయం చెప్పుకున్నాడు. కోదండయ్య కూడా చాలా మంచివాడు; పండు ముసలి; వయస్సు పైబడి వైద్యం చేయలేక అతను శివయ్యపై బాధ్యత మోపి,

సాగి మోహన్‌రామ్, బోయినపల్లి.

కృష్ణా, రామా అనుకుంటూ జీవితం గడుపు తున్నాడు. అతను శివయ్య కేదో రహస్యం చెప్పాడు అది విన్న శివయ్య సంతోషంతో ఇంటికి తిరిగివచ్చాడు.

తరువాత కొన్నాళ్ళకు శివయ్య జబ్బుతో మంచం పట్టాడు. జబ్బేమిటో ఎవరికీ అంతు పట్టలేదు. క్రమంగా అది ముదురుతూ వచ్చింది. అతని కట్లావుండగా వారి ఇంటికి ఎవరో మనిషి వచ్చి నాగన్నతో. "మీ నాన్న నాకు బాకీ వున్నాడు. అన్నీ లెక్కలుకట్టగా, మీ ఆస్తి మొత్తం సరిపోతుంది. కాని, నిన్ను చూస్తే జాలివేస్తోంది. కనుక, సగం ఆస్తి మాత్రమే తీసుకుంటాను' అని అన్నాడు. దాన్ని నాగన్న నమ్మలేక 'పచ్చి అబద్ధం! మా నాన్న ఇంతవరకు ఎవరికి కూడా బాకీ పడలేదు" అన్నాడు. అపుడా వచ్చినతను కొన్ని పత్రాలు శివయ్య సంతకంలో వున్నవి చూపించి "కావాలంటే ఇవిగో మీ నాన్న రాసిచ్చిన పత్రాలు!' అన్నాడు. నాగన్న ఆ పత్రాలు తీసుకొని వెళ్ళి శివయ్యకు చూపించి, 'నాన్నా! ఈ పత్రాలు మీరు రాసినవేనా?" అడిగాడు శివయ్య తలూపాడు. అపుడా వచ్చినతను నాగన్నచేత కొన్ని సంతకాలు తీసుకొని వెళ్ళిపోయాడు. ఇట్లా సగం ఆస్తి పోయినా కూడా నాగన్నకు బుద్ధిరాలేదు. అతని అలవాట్లు కూడా మానుకోలేదు శివయ్య కిపుడు సంపాదన ఆగిపోయింది. అతని దగ్గరికి వచ్చేవారు ఇప్పుడు తిరిగి కోదండయ్య దగ్గరికే వెళ్తున్నారు.

మరికొన్నాళ్ల కిట్లాగే ఇంకొకతను వచ్చి మిగిలింది కూడా తన పేరవేసుకొని వెళ్లి పోయాడు. శివయ్య వాళ్ళ కిపుడు తిండికి కూడా కరువు ఏర్పడింది. శివయ్య జబ్బు కూడా చాలా ముదిరిపోయింది. నాగన్న కెటూ పాలు పోలేదు. ఎందరో వైద్యులను

తీసుకొచ్చాడు. అందరూ తమచేత కావని వెళ్ళిపోయారు. నాగన్న కోదండయ్య దగ్గరి కొచ్చి, అతని కాళ్ళు పట్టుకొని "దయచేసి మీరు వచ్చి మా నాన్నని బ్రతికించండి! మా నాన్న లేనిదే మేము బ్రతకలేము' అన్నాడు. కోదండయ్య కఠినంగా, 'ముందు డబ్బు తీసికొని వచ్చి తరువాత మందు పట్టుకెళ్ళు' అన్నాడు. చేసేది లేక నాగన్న తన స్నేహితుల్ని ప్రాధేయపడ్డాడు.వాళ్లందరూ నిరాకరించారు. నాగన్న కిపుడు నిజమైన స్నేహితు లెవరో తెలిసివచ్చింది. దిగాలుపడి ఇంటికి తిరిగి వచ్చిన నాగన్నను శివయ్య ఓదార్చాడు. నాగన్న శివయ్య కాళ్ళపై పడి "నన్ను క్షమించండి నాన్నా! ఇన్నాళ్ళూ మీ మాటలు పెడచెవిన పెట్టి తిరిగిన ఫలితం నేను అనుభవించేది కాకుండా మిమ్మల్ని కూడా బాధ పెడ్తున్నాను. కోదండయ్య కూడా మీకు వైద్యం చెయ్యడానికి డబ్బు కావాలన్నాడు. నేనే గనక అపుడే మీ దగ్గిర వైద్యం నేర్చుకొంటే, ఇపుడే వైద్యుని అవసరం వుండక పోయేది. మీకు శ్రమ లేకుండా నేను సంపాదించి పెట్టుతూ, మీకు సేవచేస్తూ వుండే వాడిని" అని దుఃఖిస్తూ కూర్చున్నాడు.

శివయ్య కళ్ళలో ఆనందబాష్పాలు నిలిచాయి. తన కొడుకులో వచ్చిన మార్పుకి లోలోన మనస్సు ఉప్పొంగిపోయింది. ఇదంతా చాటునుండి విన్న కోదండయ్య కొన్ని పత్రాలు పట్టుకొచ్చాడు. అవి అప్పుల వాళ్ళు తమచేత సంతకాలు పెట్టించుకున్న పత్రాలే! నాగన్న ఆయోమయంతో "ఇదేమిటి?" అన్నాడు. "ఔను, నీ గురించి మేమాడిన నాటకమే ఇది!" అని చెప్పి, కోదండయ్య శివయ్యచేత ఏదో మందు తినిపించాడు; కాస్సేపట్లో శివయ్య లేచి కూర్చున్నాడు. ఇది కూడా నాటకమే! తన తండ్రికి ఏ అపకారం కల్గనందుకు నాగన్న చాలా ఆనందించాడు.

తన అవివేకం వల్ల సర్వనాశనం కాకుండా తండ్రి జాగ్రత్తపడినందుకు నాగన్న సంతోషించి, తండ్రి దగ్గిర వైద్యం నేర్చుకుంటూ, అతనికి నచ్చినవిధంగా మసలుకుంటూ మంచిపేరు తెచ్చుకున్నాడు.





మినీ మ్యాజిక్ :

# నీటిలో చీపురుపుల్లను నిలబెట్టడం ఎలా ?

ప్రేక్షకు లందరు మునుపటిలాగానే మెజీషియన్ హాలులో కూర్చొని వున్నారు. ఈసారి ఒక గమ్మత్తు జరిగింది. ఎప్పుడు మెజీషియన్ వస్తాడా ? అని ఎదురు చూచే ప్రేక్షకులు మెజీషియన్ రాగానే నవ్వులతో నిండిపోయింది. మెజీషియన్ తీవిగా ప్రేక్షకుల ముందుకు వచ్చి, తన చేతిలో వున్న చీపురుపుల్లల కట్టను టేబిల్‌పై వుంచాడు. అంతవరకు నవ్వుతున్న వారు నిశ్శబ్దంగా కూర్చున్నారు.

మెజీషియన్ ఒక చీపురు పుల్లను తీసుకొని ప్రేక్షకుల నుద్దేశించి, "మహాశయులారా! ఈ చీపురుపుల్లను నీటిలో నిటారుగా నిలబెట్టండి చూద్దాం!" మీలో ఎవరైనాసరే అని చీపురుపుల్లలను ప్రేక్షకులకు అందించాడు.

అంతవరకు ఆశగా ఎదురుచూస్తున్న ప్రేక్షకులు మెజీషియన్ మాటలు విని, నోట మాటలేక అలాగే నిశ్శబ్దంగా కూర్చున్నారు. కొంతసేపు కాగా, వారు ఇలా మాట్లాడుకోసాగారు. మనము పుల్లను నీటిలో వేయగనే అది నీటిపై పడిపోయి తేలుతుంది కదా! అలాంటి చీపురుపుల్లను నీటిలో అదీ నిటారగా నిలపాలట! అదెలా సాధ్యమండీ! ఇది మనవల్ల కాదనుకుంటూ మెజీషియన్‌నే చేయమని చెప్పారు.

వెంటనే మెజీషియన్ ప్రేక్షకులందరూ చూస్తూవుండగా చీపురుపుల్లను నీటిలో నిటారుగా నిలబెట్టి చూపించాడు. దానిని చూచిన ప్రేక్షకులు సంతోషంతో హర్షాధ్వానాలు చేశారు. మనం నీటిలో - పుల్లను వేయగా మునగదు కదా ? అలాంటి పుల్లను మెజీషియన్ నీటిలో ఎలా నిటారుగా నిలిపాడు ? ఆలోచించండి లేదా ప్రక్క పేజీలో చూడండి ! ఆ రహస్య మేమిటో మీకే అర్థమౌతుంది.

ఎమ్. ఎస్. కుమార్, మద్రాసు-600021.

చిత్ర కథ నెం. 44. ప్రథమ బహుమతి పొందిన రచన:

# అత్తగారి అధికారము

ఒక గ్రామంలో సూరమ్మ అనే ఒకావిడ వుండేది. ఇంటిలో ప్రతి ఒక్క విషయమూ తన అధికారం క్రిందే జరగాలనే పట్టుదలగల మనిషి. ఇంట్లో కోడలుకు కూడా ఏ పనిలోనూ స్వతంత్రము లేకుండా, అంతా తన మాటపైనే జరిపించుకొనేది. ఒకనాడు సూరమ్మ నీళ్ళు తెచ్చేందుకు బిందె తీసుకుని ఏటికి వెళ్లింది. అప్పుడు ఒక భిక్షగాడు సూరమ్మ యింటిముందు నిలిచి, "భిక్షాందేహీ!" అని అరిచాడు. లోపల వున్న కోడలు విని, అత్తగారు లేరు కదా! కనీసం భిక్షగాడి వద్దనైనా తన అధికారం చూపాలనే ఆసక్తితో లేచి వచ్చి, భిక్షగానితో ధీమాగా, అధికారం ఉట్టిపడేటట్లు, 'భిక్షం లేదూ, ఏమీలేదు వెళ్లు." అని అంది. అప్పుడే ఏటినుండి నీళ్లు తెస్తున్న సూరమ్మ అది చూసి వెళుతున్న భిక్షగాణ్ణి పిలిచి, బిరబిరాపోయి బిందెను దించి, కోడలుతో, "ఏమే! నీకు పెత్తన మెవరిచ్చారే? నేను లేకుండా చూసి భిక్షగాడి ముందు అధికారం చలాయిస్తావా?" అని గదమాయించింది. సూరమ్మ పిలువగానే భిక్షగాడు తనకు ఏదైనా యిస్తుందనే ఆశతో వెనక్కి వచ్చి యింటిముందు నిలిచాడు. అప్పుడు సూరమ్మ భిక్షగాడితో అధికార స్వరంతో "ఈ యింట్లో ప్రతి విషయంలో నాకు తప్ప మరెవ్వరికీ అధికారం లేదు. ఈ యింటి అధికారిణిని నేను. ఇప్పుడు నేను చెపుతున్నాను - నీకు భిక్షం లేదు వెళ్లు!' అంది. పాపం! భిక్షగాడు ఆశ్చర్యంతో నోరు వెళ్లబెట్టి చూస్తూ నిలుచున్నాడు

యం. యం. రాజ్‌కుమార్, కడప

---

5 కన్సొలేషన్ బహుమతులు పొందిన 5 గురి పేర్లు:

(1) గోటేటి సత్యవాణి, నిడదవోలు. (2) బి. రాధాకృష్ణమూర్తి, కాకినాడ-4 (3) కె. విజయశ్రీ. చిత్తూరు. (4) యం మురళీధరరావు, పొదలకూరు. (5) డి. శేషగిరి రావు, బి. యస్ సి., తాడేపల్లిగూడెం 534101




(21)

శ్లో॥ రాజా రాష్ట్ర కృతం పాపం
రాజ పాపం పురోహితః
భర్తా చ స్త్రీ కృతం పాపం
శిష్య పాపం గురుర్వ్రజేత్ ॥

రాజు తన దేశములోని ప్రజలను ధర్మ మార్గమున పరిపాలించనిచో ప్రజల పాపము లన్నియు తా ననుభవింపవలెను. రాజును మంచి మార్గమున నడిపింపనిచో రాజు పాపములకు పురోహితుడే బాధ్యుడు. భార్యను మంచి నడవడిక కలదానిగా చేయని భర్త ఆమె పాపములకు బాధ్యుడు చెడు నడవడికలను మాన్పించి, సత్ప్రవర్తన అలవాటుచేయనియెడల శిష్యుని పాపములకు గురువే బాధ్యుడు. తన అధీనములోని జనులకు మంచి ప్రవర్తనము అలవాటు చేయని వానికి దుష్ఫలమని, తప్పక చేయవలెనని భావము.

శ్లో॥ గీతే వాద్యే తథా నృత్తే
సంగ్రామే రిపుసంకటే
ఆహారే వ్యవహారే చ
త్యక్తలజ్జ స్సుఖీ భవేత్.

సంగీతము పాడునపుడు, వాద్యములు వాయించునపుడు, నాట్యము చేయునపుడు, యుద్ధరంగమునందు శత్రువులు చుట్టుకొన్నప్పుడు, భోజనము చేయునప్పుడు, వ్యవహారమునందు సిగ్గు పనికిరాదు. సిగ్గును వదలి పెట్టినవాడే సుఖము పొందగలడు.

ముఖ చిత్రం:

# గార్ధభాకారుడైన (గాడిద) ధేనుకాసురుని

## బలరాముడు వధించుట

బలరామ శ్రీ కృష్ణులు గోవులతో గోప బాలకులతో అడవులలో సంచరిస్తూ, పచ్చిక పట్టులలో పశువులను మేపుతూ యమునానదిలో జలక్రీడలు చేస్తూ - బాలకులతో విహరిస్తూ దినములు గడపుతున్నారు-గోప బాలకులు తమ పూర్వజన్మ పుణ్య విశేషాలవలన పరమాత్ముడైన శ్రీ కృష్ణుని సేవిస్తూ ఉన్నారు. అందులో శ్రీరాముడని పేరుగల గోప బాలకుడు రామకేశవులతో "కొంత దూరంలో చక్కని తాటితోపు ఉన్నది. ఆ తాటి చెట్లకు మంచి ఫలాలు ఉన్నాయి. వాటి వాసన ఇక్కడకు కూడా వేస్తున్నది. అయితే ఆవనంలో ధేనుకుడనే గాడిద స్వరూప రాక్షసుడు ఉండి అక్కడకు వచ్చిన వాళ్లను చంపితింటాడు. మీరిద్దరూ ఉండగా మా కేమిభయం? మమ్మల్ని ఆ తాటి వనానికి తీసుకువెళ్ళి ఆ తాటి ఫలాలు తినిపించండి'' అని కోరాడు. ఆ చెలికాని కోరికను మన్నించి బలరామ కృష్ణులు గోప బాలకులతో తాటివనానికి వెళ్ళారు. బలరాముడు తాటి చెట్లను బలంతోపట్టి ఊపాడు గుండ్ల కొద్దీ పండ్లు నేల మీద రాలినవి. వాటిని గోప బాలకులు తినడం ప్రారంభించారు. పండ్లు నేలమీద రాలిన చప్పుళ్లకు గార్ధభాసురుడు నిద్రలేచి, చూచి, కోపించి పరుగున వచ్చి వెనుక రెండు కాళ్లతో బలరాముణ్ణి తన్నబోయాడు.

బలరాముడు వాడి నాలుగు కాళ్ళు పుచ్చుకుని గిరగిరా త్రిప్పి తాటి చెట్లకు వేసి కొట్టి చంపాడు. ఆ దెబ్బలకు తాటిచెట్లు అనేకం నేలమీదకు వ్రాలిపోయాయి. గాడిద రాక్షసుడు బలరాముని చేతులలో చచ్చిపోవడం చూచిన వాడి బంధువులు మందలు మందలుగా గాడిదలై బలరామ కృష్ణుల మీదకు వచ్చారు. వాళ్ల వెనుక కాళ్లు పుచ్చుకుని ఆకాశం లోకి ఎగురవేసి గాడిద రాక్షసులందరినీ వధించారు బలరామ కృష్ణులు. గోప బాలకులు హాయిగా తాటి పండ్లు తిన్నారు, గోవులు శాంతిగా అక్కడ పచ్చిక మేశాయి.

Regd. No M-6703 BALAMITRA (TELUGU) Re.1.25 APRIL 1976.

నీరతో ఆమె ముఖం తుడిచాడు. ఆమె గర్భంలో శిశువు కదలిక గమనించి - గర్భవతి అని గ్రహించాడు. ఇంతలో ఆమె కాళ్ళవద్ద రక్తపు మాయ ముసుగులో నిసుగు పడడం చూచాడు ఆమె ప్రసవించింది - కానీ, చనిపోయింది అని మహర్షి చింతతో ఆమెనే చూస్తూ కన్నీళ్ళు కార్చాడు. మాయ ముసుగు పగిలి నిసుగు కెవ్వు మనింది ఆ ఏడుపు మహర్షి మనస్సును కదలించింది బిడ్డనెత్తి విరిగి పడి యున్న బల్లెపు కొనతో నాభి నాళం కోసి - ఉమ్మినీరొత్తి తన అంగవస్త్రం బిడ్డకు చుట్టాడు. ఏడుస్తూన్న బిడ్డని బొదివి ఎత్తుకున్నాడు. ఒక చేత బిడ్డనీ మరోచేత కమండలం. దండం తీసి కొని కమండలంలోని నీరు చుట్టూ పడివున్న వారిచుట్టూ ధారగా కార్చాడు ఆ ధారలో నుండి మహాగ్ని పుట్టి పల్లకితోడ వారి నందరిని బూడిద చేసింది - ఆ వృత్తాంతం తెలుపక నే బిడ్డని తన కప్పగించి పోయిన ఆ మాతృమూర్తిని స్మరిస్తూ - దివ్యదృష్టితో ఆమె వృత్తాంతం తెలిసికొని నిట్టూర్చి దుఃఖంతో తన ఆశ్రమానికి వచ్చాడు.

మహర్షి బిడ్డని కృష్ణాజినంపై పండబెట్టి ధాన్యంలో తేనె తెచ్చి వేలితో చుక్కలుగా వాని నోట వేశాడు. ఆ చుక్కలు తియ్యని పసికందు పెదవులు విప్పి చప్పరించాడు. ఏదైనా మహర్షికి బిడ్డ పోషణలో తపోనిష్ఠ కుంటు పడింది కాని, ఆత్మావలోకనంలో తనకు లభించే ఆనందానికన్నా బిడ్డనివల్ల కలిగే ఆత్మానందం ఎక్కువగా వుండ, బిడ్డకు ఆకలి ఏడ్చినపుడు మహర్షి తపో నియమం వదలి పాలచెట్టు దగ్గరకుపోయి కొమ్మ విరిచి కమండలాన్ని పట్టేవాడు- పాలకొమ్మనుండి పాలు ధారగా కమండలంలో పడేవి. ఆ పాలు బిడ్డకి త్రాగించేవాడు. క్రమంగా మహర్షి పోషణలో బిడ్డడు పెరిగి ఎనిమిదేళ్లవాడయ్యాడు మహర్షి వానికి మంత్రోపదేశం చేసి బిడ్డా! నీవు ఈ మాండవీ నదీ తీర లో వెలసియున్న 'వీర భద్రేశ్వరుని' భక్తితో సే... సేవించు



కాలము నీకు అకాలదప్పు లుండవు. స్వామిని ప్రత్యక్షము చేసికొని రమ్ము, నీ కదియే మేలు" అని విద్యుంబ మహర్షి బిడ్డని వీరభద్రేశ్వరుని కడకు తీసికొనిపోయి సేవా విధానం చెప్పి వదలి వచ్చాడు, ఆ బిడ్డడు భక్తి శ్రద్ధలతో మహర్షి చెప్పిన మంత్రాన్ని పండ్రెండేళ్లు నియమంతో వీరభద్రేశ్వరుని సేవించాడు. వాని భక్తికి మెచ్చి వీరభద్రేశ్వరుడు ప్రత్యక్షమై "బిడ్డా! నీకు మేలు కలుగుగాక! నీవు పరాక్రమవంతుడవై ఈ దేశమునకు ప్రభుడవౌదువుగాక! నీవు నీ వంశీయులు నన్ను సేవించినంతకాలము ఏ లోపములు లేక సుఖంగా వుండగలరు నా సేవ మరచినచో - ఆపదలు తప్పవు. నీ గురుని అనుమతిని నెరవేర్పుము పొమ్ము' అని మాయమయ్యాడు.

ఆ బిడ్డడు సంతోషముతో వీరభద్రేశ్వరునకు మ్రొక్కి తన గురుని ఆశ్రమానికేగి జరిగిన వృత్తాంతం చెప్పాడు. మహర్షి దైవదర్శనం చేసికొని వచ్చిన బిడ్డని కౌగలించుకొని, "బిడ్డా! ఈ వీరభద్రేశ్వరుడు నీవు తలంచినపుడు ప్రత్యక్షమగు వేల్పు. అతన్ని నీ వెప్పుడూ మరువరాదని ఇంక నీ జన్మవృత్తాంతం నేను దివ్యదృష్టిలో తెలిసికొన్నది వినుమని ఇలా చెప్పాడు.

'బిడ్డా! మీది క్షత్రియవంశము, మీ తండ్రి పుణ్య గౌతమీ ఉత్తరదేశ పాలకుడైన మహా పరాక్రమవంతుడు కానీ, కాలప్రభావం అతన్ని శత్రురాజులచే ఓడింపజేసింది. దక్కిన పరివారంతో గర్భవతియైన తన భార్యతో ఆ మహారాజు పల్లకిలో వృషభాచలానికి పోతూండగా శత్రువులు వసిగట్టారు. ఈ నా ఆశ్రమం సమీపంలో వారిని శత్రువులు ముట్టడించారు. పల్లకీ బోయీలను, భటులను చంపి పల్లకిలో నున్న మీ తల్లిని లాగి పడత్రోసి ఆమె ఆభరణాలు దోచుకొన్నారు. మీ తండ్రిని బంధించి సజీవ దహనం చేశారు మీ తల్లి నిన్ను ప్రసవించి ప్రాణం వదిలింది మాయ ముసుగులో నిసుగువైన నిన్ను తెచ్చి పెంచాను. నీవు యుక్తవయస్కుడవయ్యావు. వీరభద్రేశ్వరుని అనుగ్రహంవల్ల నీవు నేర్వకనే అన్ని విద్యలు నీకు లభించాయి, నీవు నా వెంట రమ్ము" అని మహర్షి బిడ్డని అతని తల్లి భస్మమైపోయిన చోటుకు తీసికొని వెళ్ళాడు. అదిచూచి బిడ్డడు విలపించాడు.

"బిడ్డా! దుఃఖించకు - ఇదిగో దండము దీనిచే నీ వీ ప్రాంతమున కావలసినంత మేరకు గీత గీయుము. అంతవరకు - నీ తల్లి 'మాటలీ దేవి' పేర మహా సామ్రాజ్యం పాలించు" అని మహర్షి దండమును బిడ్డనికిచ్చాడు. దానినందుకొని బిడ్డడు తన ఇచ్ఛవచ్చినట్లు మాండవీ నదీ తీరమునంటి రెండు క్రోసుల విస్తీర్ణముగా గీత గీచి దండాన్ని మహర్షికిచ్చాడు. వెంటనే అచ్చట దుర్గప్రాసాద సహితంగా మహా నగర మొకటి కన్నుల పండువుగా వెలసింది. దానిని ఆశ్చర్యంతో చూస్తున్న బిడ్డని చూచి, "ఇంక నీవు వీరప్రతాపుడను పేరున నీ వీరప్రతాపం నల్దిక్కుల వ్యాపించునట్లు చేయుము" అని దీవించి బిడ్డని ఆశ్రమానికి తోడ్కొని వచ్చాడు

క్రమంగా మహర్షి ఆశ్రమానికి వచ్చే బాటసారులు మాటలీ నగర వైభవం చూచి - అది



తమ నివాసానికి యోగ్యమని అక్కడే స్థిరపడే వారు. కొలది కాలానికి మాటిలీ నగరం జనులతో నిండింది. మహర్షి వీర ప్రతాపునికి హిరణ్య రాష్ట్ర పాలకుడగు సోమశ్రవుని కుమార్తెను వివాహం చేయించి మాటిలీ నగరానికి మహారాజుగా పట్టాభిషేకం చేయించాడు - అనంతరం విదుంబ మహర్షి తపో నియమంలో వుండుటకై వృషభాచలం వెళ్ళాడు.

వీరప్రతాపుడు తన వంశమును ఉద్ధరించిన విదుంబ మహర్షిని స్మరిస్తూ తన "వంశము విదుంబ వంశమనీ - తన రాజ్యము వైదుంబ నాడనీ తన కులదైవము వీరభద్రేశ్వరుడనీ" లోకంలో చాటించాడు. విజయ యాత్రలుచేసి తన రాజ్యాన్ని కృష్ణవేణి నుండి దక్షిణాన క్షీరవాహిని వరకు విస్తరింపజేశాడు. వీరప్రతాపుడు వీరభద్రేశ్వరుని స్మరింపనిదీ - దర్శింపనిదీ ఏ పనీ చేసేవాడు కాదు.

వీరప్రతాపుని ఆస్థానం మహా విద్వాంసులతో వైభవంగా వుంది. సర్వ సౌఖ్యాలతో రాజ్యభోగాలనుభవిస్తూ ఆ మహానందంలో వీరప్రతాపుడు వీరభద్రుని విస్మరించాడు అతని ఆస్థానంలో ఈశ్వరభట్టు అనే జ్యోతిష్కుడున్నాడు. ఒకనాడు వీరప్రతాపుడు ఇష్టాగోష్టిలో నుండి - ఈశ్వరభట్టుతో "స్వామీ! మీరు రేపటినుండి ప్రతిదినం ఉదయం పంచాంగ వివరణంతోపాటు మాకు జరుగబోవు దినచర్య తెలుపండి" అన్నాడు. ఆ మాట విని ఈశ్వరభట్టు "మహారాజా! మీ దినచర్య నేను చెప్పవచ్చు. మీరు తెలియవచ్చు - అవసరమగుచో దాని ఉపయోగం వుండనే వుంటుంది. ఒకవేళ దానివల్ల మేలో - కీడో కలుగవచ్చు. గడచినది తెలిసికొన్నా - జరుగుతూ వుండేది తెలిసికొన్నా - ప్రమాదం లేదు. జరుగబోయేది తెలిసికోవడం ప్రమాదమే మో!" అని వూరకున్నాడు. "ఏమైనా మీరు జరుగబోవు మా దినచర్యను గూర్చి ముందుగా తెలుపవలసిందే జాగ్రత పడవచ్చుకదా!" అని మహారాజు అజ్ఞాపించడంతో ఈశ్వరభట్టుకు చెప్పక తప్పిందికాదు. ఈశ్వరభట్టు 'సరే' అన్నాడు.

మరుదినం నుండి ఈశ్వరభట్టు ఉదయాన్నే అంతఃపురానికి వెళ్ళి పంచాంగ వివరణంతో పాటు మహారాజు దినచర్య చెప్పడం ప్రారంభించాడు ఇలా కొంత కాలం గడిచింది. ఒకనాడు ప్రొద్దున్నే ఈశ్వరభట్టు అంతఃపురానికివచ్చి పంచాంగ శుద్ధి చెప్పి "మహారాజా! ఈనాడు మీరు స్నానం చేసేటప్పుడు మీ చేతనున్న నీటి కుండిక జారి పడుతుంది. మీరు



కట్టుకున్న వస్త్రం వీడి జారిపోతుంది. మీరు భోజనం పూర్తి చేయకు శత్రువులు మీ కోట ముట్టడిస్తారు వారితో ఘోర యుద్ధం జరుగుతుంది. మీకు రాత్రివేళకు అరణ్య ప్రాప్తి - అక్కడ వెదుర బియ్యం తినే యోగం వుంది. ఇది ఈనాటి మీ దినచర్య'' అని చెప్పి వెళ్ళిపోయాడు,

వీరభ తాపుడు దినచర్య చెప్పి పోతూన్న ఈశ్వరభట్టును చూచి నవ్వుకున్నాడు, పిచ్చి బాపడు. ప్రశాంతంగావున నా రాజ్యాన్ని శత్రువులు చుట్టు ముట్టుతారా? వారితో యుద్ధమా? నాకు అడవిలో వెదురు బియ్యం తినే యోగమా? ఈ బుడుపోకకు చెప్పినవన్నీ శాస్త్రాలా? అవన్నీ సత్యాలా? బ్రాహ్మడు బతుకు దెరువుకు చెప్పే మాటలుగాక ?''

అని అనుకొంటూ నిద్రమంచంనుంచి లేచి కాలకృత్యాలు తీర్చుకొన్నాడు.

దాస దాసీలు స్నానానికి వేళయిందని హెచ్చరిక చేశారు. మంగళ వాద్యాలతో మహారాజు స్నానమందిరానికి వెళ్లాడు. రాజు స్నానం చేస్తూండగా సేవకుల చేతిలోని నీటి కుండిక తానందుకొని నీళ్ళు పైన పోసుకోపోయాడు. అది చేతినుండి జారి క్రింద పడింది. దాన్ని అందుకోబోగా కట్టుగుడ్డ వీడి మోకాళ్లవరకు దిగజారింది. రాజునకు జ్యోతిష్కుడు చెప్పిన దినచర్యలోని వాక్యాలు జ్ఞాపకం వచ్చాయి. అవి సామాన్యంగా ఎప్పుడూ జరిగేవేలే! అని అనుకొని స్నానం ముగించాడు.

పూజా మందిరానికి వెళ్ళి దేవతార్చనచేసి భోజనశాలకు వెళ్ళాడు - బంగారు పళ్లెంలో షడ్రసోపేతమైన పదార్థాలు వండి వడ్డించినవి మహారాజు భుజిస్తున్నాడు. ఇంతలో చతుశ్శాలా గోపురంలో సైనికులు యుద్ధానికి సిద్ధం కావడానికై మ్రోగించే గంట మ్రోగించారు. భేరీ భాంకృతి మహారాజు చెవులు బ్రద్దలు చేసింది భటుడొకడు వచ్చి భోజనశాల వాకిట నిల్చి - "మహారాజా! శత్రువులు మన కోటను ముట్టడించారు. మేము యుద్ధానికి సిద్ధమయ్యాము" - అని వెళ్లిపోయాడు. మహారాజు తింటున్న భోజనం వదలి తక్షణమే ఖడ్గపాణియై అంతఃపురం వెడలి తనకై సిద్ధంగా వున్న రథంలో యుద్ధానికి వెళ్ళాడు.

యుద్ధం ముమ్మరం గాసాగింది యుద్ధం లో వీరప్రతాపుని ప్రతాపం మొక్కవోయింది, ఏమీ చేయలేక ఒంటరిగా అడవిలోకి రహస్యంగా వెళ్ళాడు - అప్పుడే ప్రొద్దు గ్రుంకింది వీరప్రతాపుడు ఓడిపోయెనని శత్రువులు జయధ్వానములు చేశారు కాని అస్తమానమైనందున యుద్ధం చాలించినట్లు ప్రకటించారు.

అడవిలో వీరప్రతాపుడు పోతూ - తన కిరీటం అభరణాలు తీసి మూటకట్టి నెత్తిన పెట్టుకొని దానిపై తలపాగా చుట్టకొన్నాడు - బాటసారివలె చీకట్లో ఒక దారి పట్టాడ, ఆ దారి వీరప్రతాపుని ఒక బోయ గూడెం చేర్చింది.

తాను గూడెంలోకి పోతే ఏమవునోనని - గూడెం వెనుక నిన్న లావు మద్ది చెట్టతొర్రలో దాక్కొబోయాడు. ఆ చీకట్లో ఎట్లా గమనించాడో ఒక బోయ - 'దొంగ - దొంగ' అన్నాడు నిముషంలో గూడెంలోని మగ రంతా మద్ది చెట్టు చుట్టుకొన్నారు రాజును తొర్రలోనుంచి ఈడ్చుకొని వచ్చి రచ్చబండకిద నున్న నిలువు రాతికి బంధించారు

వీరప్రతాపుడు జ్యోతిష్యుని పల్కులు తలంచుకొన్నాడు పెద్దలమాట మన్నింపక పోయాను. జాగ్రత్త పడివుంటే నాకీస్థితి వచ్చేది కాదు జాగ్రత కలగాలన్నా దైవ సంకల్పం వుండాలి అని అనుకొంటూ ఇలవేల్పు వీరభద్రేశ్వరుని స్మరించాడు అతని మనస్సులో ప్రత్యక్షమైన వీరభద్రేశ్వరుడు "రాజా! పెద్దల మాట వినకపోవడం - శాస్త్రాన్ని తృణీకరించడం - రాజ్య భోగాలలో సుఖంగా వుండి నన్ను దక్షింపక పోవడంవల్ల నీకీ పరిస్థితి యేర్పడింది నీవు నెత్తిన పెట్టుకున్న మూట తీయగనే బోయలు నిన్ను గుర్తించి గౌరవించి సాయం చేయగలరు. వారి సాయానికి కృతజ్ఞతగా వారికి రాజమర్యాద లిచ్చి గౌరవించు వారు రాజులై నీ అండగానుంటారు వీరు నేనున్నచోట వుండి నన్ను కొలుస్తూంటారు. రాజులై ఈ బోయలున్న నా చోటు నీ తర్వాత రాజులకు వీరిపేర 'రాచవీడు'గా ప్రఖ్యాతమౌతుంది" అని మాయమయ్యాడు. వీరప్రతాపుడు మూట తీయడానికి చేతులు లేక ఎలా తీయడం? అని ఆలోచిస్తూండగా బోయలు కట్టెలుపేర్చి ఆతని ముందు మంట వేశారు.

ఆ వెలుగుల్లో గుడ్డ మూటలోని ఆభరణాలు తళుక్కుని మెరిశాయి. అది చూసిన ఒకబోయ "ఒరేడూ! వీడు గండర గండడైన దొంగరో! యాడ్నో రాచకొంప కొల్లగొట్టాడు. మన రాజు కొంపేమో!' అంటూ రాజు తల మీద నున్న మూటతీసి విప్పిచూచాడు. అవి తమరాజు ధరించే ఆభరణాలే - అని వాడు కోపంతో "మారాజు కొంపే కొల్లగొట్టావురా!' అని మండే అంచెకట్టె తీసికొని వీరప్రతాపుని మూతిపై పొడవబోయాడు ఆశ్చర్యంతో కదలక నిలుచుక్కుపోగా చేతిలోని అ చెకట్టె జారి క్రిందపడింది. వాడేదో చెప్పపోయాడు కాని మాట పెగలలేదు. ఆదేమని బోయలు మండే అంచెకట్టెలెత్తి రాజును చూచారు. అతడు

తమ రాజుని గుర్తించి తత్తరంతో కట్లువిప్పి అతని పాదాలపైబడి మన్నింపుమని వేడుకొన్నారు.

రాజు వారిని మన్నించి - "నాకు ఆకలిగా వుంది" అన్నాడు. వెంటనే బోయలు వృద్ధ ముత్తయిదువచే వెదురు బియ్యం వండించి విప్పపూల తేనెతో అన్నం కలిపి పారుటాకులో రాజుకు వడ్డింపజేశారు. రాజు ఆ అన్నం తృప్తిగా భుజించి బోయలకు తన వృత్తాంతం చెప్పాడు. అప్పటికప్పుడే బోయలు చుట్టుపట్టుల వున్న తమ వారిని రప్పించుకొని తెల్లవారే సరికి ఆయుధాలతో యుద్ధానికి సిద్ధమైనారు. కొమ్ములు, బుంగలు, బాకాలు, ఊదుకొంటూ రాజుతో మాటిలీకోట వైపు నడిచారు.

మహామంత్రి నాయకత్వంలో మాటిలీసైన్య శత్రువులతో పోరాడుతూంది. వెనుక నుండి బోయసైన్యం వారిని క్రమ్ముకొనడంతో శత్రు సైన్యాలు ఇరువైపులా పోరలేక కకావికలై పోయాయి. శత్రువులు బంధింపబడ్డారు. ఆనాడు వీరప్రతాపుడు విజయోత్సాహంతో పురంలో ప్రవేశించాడు. వెంటనే సభచేరి ఆస్థాన జ్యోతిష్కుడు ఈశ్వరభట్టును పిలిపించాడు.

ఈశ్వరభట్టు వచ్చి రాజును దీవించాడు. బంగారు పళ్ళెరంలో దివ్యరత్నాంబరాలుంచి మహారాజు ఈశ్వరభట్టునకు అందించాడు.

ఈశ్వరభట్టు దానిని అందుకొనలేదు. అది గ్రహించి వీరప్రతాపుడు - "దైవజ్ఞులకు ఈ సన్మానము స్వల్పమేమో! ఇదిగో నా రా



జ్ఞాన్నే మీకు ధారపోస్తున్నాను. నా అల్పజ్ఞత మన్నింపుడు - మీరు చెప్పిన నా దినచర్య సత్యమైంది. జ్యోతిష ప్రభావం తెలిసికోలేక పోయాను. ఇపుడు అనుభవంతో తెలిసికొన్నాను," అన్నాడు.

ఈశ్వరభట్టు నవ్వుతూ "మహారాజా! మీకు తగిన విధంగా నేడు గ్రహగతితో అదృష్టం కలిసి వచ్చినందున మీకు విజయం లభించింది. అందుకు నన్ను ఇప్పుడు గౌరవిస్తున్నారు.

అట్లుగాక గ్రహగతి విపరీతమై వుండినచో జ్యోతిషశాస్త్రం అసత్యమని దూషించి నాకు శిరచ్ఛేదన శిక్ష విధించి యుండేవారు. నేడు నా దినచర్యలో శిక్ష తప్పె గ్రహగతి చక్కగా వుంది కాబట్టి మేలయింది. ఎప్పుడూ శాస్త్రాన్ని పరీక్షించరాదు. దానికి విలువ కట్టరాదు.

శాస్త్రం చెప్పిన దాన్ని చేయడమే మన పని - శాస్త్రం అనుభవంతో ఏర్పడిందే - అనవసరాలకు ఉపయోగింపరాదు. అవసరమైనపుడే శాస్త్రాన్ని సమీక్షించాలి. మీ క్షేమమే మా క్షేమం - నా విధిని నేను నెరవేర్చాను. నేను శేష జీవితం తపోనియమంతో గడుపదలిచాను ఇక సెలవు" అని ఈశ్వరభట్టు "సుఖీభవ" అని రాజును దీవించి ఆస్థానం నుండి వెళ్ళిపోయాడు.

వీరప్రతాపుడు నిశ్చేష్టుడై ఈశ్వరభట్టు ముఖద్వారం దాటిపోవడం చూస్తూ, పెద్దలను పరీక్షించినందువల్ల ఏమి కీడు మూడునో అని పశ్చాత్తాపంతో క్రుంగిపోయాడు. వీర



భద్రేశ్వరుని అనుజ్ఞతో తనకు సాయం చేసిన బోయలను రాజమర్యాదలతో గౌరవించాడు. కృష్ణవేణి నది దక్షిణ తీరం నుండి వృషభాచలము ఇరువైపులు హద్దులుగా క్షీరవాహిని వరకు తూర్పు సముద్రము నంటియున్న అరణ్యాన్ని పండ్రెండు కొట్టములుగా భాగించి బోయలకు బహూకరించాడు. బోయలు అడవి కొట్టములకు నాయకులై కాళేవిని - వీరభద్రేశ్వరుని సేవిస్తున్నారు.

పాపలూ! ఆ బోయలు పాలించే అరణ్య భాగాలే బోయకొట్టములని మన చరిత్ర చెప్తుంది.

పొత్తపి నాటిలోని ఉడుమూరు ప్రాంతం బోయ కొట్టానికి నాయకుడే 'తిన్నడు. శ్రీ కాళహస్తీశ్వరునికి కన్నులర్పించి 'కన్నప్ప' అయ్యాడు. 'పెద్దల మాట పెరుగన్నం మూట'' - అనే సామెత మీరు వినే వుంటారు పెద్దలమాట అనుభవాల కోట కావున - కోట రాజ్యాన్ని కాపాడినట్టే అనుభవంతో కూడిన పెద్ద మాట మనలను కాపాడుతుంది. మన మేలుకై అనుభవాలతో చెప్పిందే శాస్త్రం - శాస్త్రాన్ని లెక్క చేయక పోవడం - దాన్ని పరీక్షించడం చేయరాదు. శాస్త్రం చెప్పినట్టు నడుచుకోవడమే మన పని మహనీయుల మనస్సునూ పరీక్షింపరాదు. దానికి విలువ కట్టరాదు.

అది విలువ లేనిది కదా! మనకెంత సుఖమబ్బినా కష్టమబ్బినా దేవుని విస్మరింప రాదు నిందింపరాదు మన కష్టసుఖాలకు దేవుడు కారణం - దేవుని స్మరణం మన ముక్తికి మూలం" అని శ్రీపర్వతం ఎగిరి శ్వేతవరాహం చేసిన ఇసుకగుంతలో వ్రాలింది - అందు అందమైన శిల్పసుందరీ స్తంభం నిల్చింది. శిలపై 'హ' అనే అక్షరం ఏర్పడింది ప్రొద్దు గ్రుంకినందున శ్రీమతీ శ్రీ చరణులు శిలక్రింది గుహలోకిపోయి వింతశబ్దాలు వింటూ నిద్రించారు.

—మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యం,

బుడ గుంటపల్లె.






# తెలివి తక్కువ కాకులు

కాశీ రాజ్యాన్ని బ్రహ్మదత్తమహారాజు పరిపాలిస్తున్న రోజులవి. ఆ కాలంలో బోధిసత్త్వుడు సముద్రంలో ఒక జలదేవతగా జన్మించినాడు.

సముద్రపు గట్టుమీద ఒకనాడు కొంత మంది శివపూజ చేశారు ఆ శివపూజలో జనం పండ్లు, పాలు, మాంసము, కల్లు నాగులకు నైవేద్యం పెట్టి సముద్రతీరంలో ఉంచి పోయారు. ఆ సమయానికి ఒక మగ కాకి, ఒక ఆడ కాకి అక్కడకు వచ్చి ఆ పాలను త్రాగి, మాంసపు ముక్కలను తెగ తిని అమితంగా కల్లు త్రాగినాయి, కల్లు త్రాగగా వాటికి విపరీతమైన మత్తు పుట్టుకువచ్చింది. ఆ మైకంలో అవి స్వైరవిహారం చెయ్యసాగించాయి. సముద్రపు అలలు నేలకు కొట్టుకున్న చోట్ల నురుగు దొబ్బలు కట్టి వుండగా వాటిపైన ఎగురుతూ వాటిని ముక్కుతో పొడుస్తూ ఆటలు సాగించాయి కొంతసేపయిన తర్వాత ఆడకాకి ఎగురుతూ కొంచెం లోపలకు పోయి నీటిమీద తేలుతున్న చిన్న కర్రముక్కమీద వ్రాలింది.

కాకి బరువును కర్రపుల్ల భరింపలేదు. అందుచేత కర్రముక్క దానితో ఆడ కాకి నీళ్ళలో మునిగినాయి. అప్పుడొక పెద్ద గండు చేప వచ్చి ఆడకాకిని గుటుక్కున మ్రింగివేసి వెళ్ళిపోయింది ఆడకాకిని పెద్ద గండు చేప మింగటం మగకాకి చూడలేదు ఆ పని కాకి నీళ్ళలో మునిగినప్పుడు జరిగింది అందుచేత మగ కాకికి కన్పించలేదు. కాని ఆడకాకి నీళ్ళలో మునిగి పోవడం మాత్రం మగకాకి చూచింది.

"అయ్యో! నా ప్రియురాలు నీళ్ళలో మునిగి చచ్చిపోతున్నది" అంటూ మగకాకి పెద్ద పెట్టున ఏడుస్తూ గోల చెయ్యడం ప్రారంభించింది, దాని గోలకు దూరంనుంచి చాల కాకులు వచ్చి చేరాయి. అవి మగకాకిని ఎందుకు గోలవేస్తున్నావని అడిగినాయి. తన



ప్రియురాలిని సముద్రుడు లోపలకు లాక్కు పోయాడని మగకాకి చెప్పింది. "అయ్యో" అంటూ ఆ కాకులన్నీ గోలచెయ్యడం సాగించాయి. అందులో ఒక కాకి చాల తెలివిగల దానిని అనుకునేది వున్నది. అది తెలివితేటలు గల కాకి అని మిగిలిన కాకులన్నీ దానిని గౌరవిస్తాయి. దాని మాటలు వింటాయి. ఆ తెలివి తేటల కాకి ప్రతి పర్యాయం తన తెలివి చూపడానికి ప్రయత్నిస్తుంది. ఇప్పుడు తన కున్న తెలివిని చూపించి సముద్రుడు లాక్కు పోయిన ఆడకాకిని రక్షించాలని దానికి అనిపించింది. అది ఆలోచన చేసింది. ఒక పథకం దానికి తట్టింది.

కాకులన్నీ కలసి సముద్రపు నీటిని త్రాగి వేస్తే జలం అంతా అయిపోయి లోపలవున్న ఆడకాకి బయట పడుతుంది. అప్పుడు దానిని తాము తీసుకొని రావచ్చు. ఇది ఆ తెలివి తేటలుగల కాకి చేసిన ఆలోచన. మిగిలిన కాకులు ఆలోచన బాగా వున్నదన్నాయి ఆ ప్రకారం చెయ్యడం సాగించాయి. ఎగిరి సముద్రపు నీటిని త్రాగటం. కొంతసేపు కూర్చోటం మళ్ళీ నీళ్ళు త్రాగటం - ఇట్లా కాకులన్నీ సాగించాయి సముద్రపు వుప్పు నీరు త్రాగి గొంతుకలన్నీ చెడిపోయాయి. నోరు పెగలటం లేదు. ఎగిరెగిరి అలసిపోయాయి. ఇక రెక్కలు కదల్చలేని స్థితికి వచ్చాయి. అప్పుడు తెలివి తేటలుగల కాకిని చూచి మిగిలిన కాకులన్నీ "ఓయి మేధావి! ఏదైనా మరొక ఆలోచన చెయ్యవయ్యా" అన్నాయి.

ఆ తెలివిగల కాకి మళ్ళీ ఆలోచించింది. "ఔను ఎంతసేపు మనం నీళ్లు త్రాగినా సముద్రం కొంచెముకూడా తగ్గలేదు. అంతేకాక మన గొంతుకలు చెడ్డాయి. మనం బలహీనులమైనాము. రెక్కలను కదలించలేకుండా వున్నాము. సముద్రాన్ని మనం యీ విధంగా జయించలేము. దాన్ని తిట్టిపోద్దాము. దానికి సిగ్గు వచ్చేటట్లు చేద్దాము" అన్నది.

మిగిలిన కాకులు సరేనన్నాయి "నీళ్ళలో మునిగిపోయిన ఆడకాకి చాల చక్కనిది. దాని ముక్కు ఎంతో అందంగా వుంటుంది. దాని రెక్కలు మిక్కిలి సొగసైనది. దాని గొంతుక అతి మధురంగా వుంటుంది. మొత్తం మీద ఆ ఆడకాకి నిజంగా ఆడకాకు లన్నిటి కంటె అన్నివిధాల సౌందర్యరాశి. దానిని చూస్తేనే మగకాకులన్నిటికి విపరీతంగా మోహం పుట్టుకు వస్తూ వుంటుంది. ఆ ఆడ

కాకి గొప్ప పతివ్రత కాబట్టి ఇంకొక మగ కాకితో జతకట్టలేదు. లేకపోతే మగకాకులన్నీ దానితో జత కూడటానికి సిద్ధంగానే వున్నాయి. అటువంటి ఉత్తమ కాకి, పతివ్రత ఆడకాకిని యీ సముద్రుడు కామాతురుడై చెరపట్టి లోపలకు తీసుకువెళ్ళి దానితో సుఖిస్తున్నాడు. పతివ్రతా శిరోమణి కాకిని పాడుచేసిన రాక్షసుడే సముద్రుడు. వీడు నాశనమౌతాడు. వీడు చావ. వీడి ప్రాణం పోను. సిగ్గులేని రౌడీ వెధవ సముద్రుడు. కాకి జాతికి చాల సిగ్గు. వీడి దుంపతెగ. ఈ సముద్రుడు బహిరంగముగా ఆడకాకిని లాక్కుపోయాడు, వీడి వంశము నశించ" ఇట్లా కాకులు సముద్రుణ్ణి తిట్టుతూ గోల చేస్తున్నాయి.

తిట్టిన తిట్టు తిట్టకుండా తెలివిగల కాకి తిట్టుతున్నది. దాని తిట్లు మిగిలిన కాకులన్నీ తిరిగి తిరిగి అంటున్నాయి. ఎంతసేపటికి సముద్రునికి సిగ్గు వచ్చినట్లు లేదు. వాడు ఆడకాకిని వదలిపెట్ట లేదు. ఎంతసేపటికి సముద్రునికి కామము తీరినట్లు లేదు. వాడు ఆడకాకిని వదలిపెట్టలేదు.

ఈ కాకులను చూడగా జలదేవతగా వున్న బోధిసత్త్వునికి జాలివేసింది.

తెలివి తక్కువగా అవి గోలచేస్తూ అలసిపోతూ ప్రాణాలు పోగొట్టుకుంటున్నాయి. వాటిని సక్రమ మార్గంలో పెట్టాలనుకున్నాడాయన,

ఒక పెద్ద దేవతకృతిని గోల పెట్టుతున్న కాకుల సమీపానికి పంపించాడు. దానినిచూచి కాకులు "కావు కావు" అంటూ దేనికితోచిన దిక్కునకు అడిగా చెల్లా చెదరుగా ఎగిరిపోయాయి.

అందుచేత యీ సంగతి విస్మరించి మళ్ళీ వాటి సహజ ధర్మంలో పడ్డాయి. వాటి ప్రాణాలు మిగిలాయి.






పూర్వం కుంతల దేశాన్ని విజయసేనుడనే రాజు పరిపాలించేవాడు. ఆయనకు జ్యోతిష శాస్త్రంలో నమ్మకం లేదు. ఒక రోజు ఆయన ఆస్థానానికి రామశర్మ అనే జ్యోతిష్కుడు వచ్చాడు. మంత్రులు ఆయన గొప్ప జ్యోతిష్కుడని చెప్పడంతో తన కిష్టంలేక పోయినా, తన నౌకరు జయంతుని చెయ్యిచూచి జ్యోతిష్కం చెప్పమన్నాడు రాజు. అతనికిమాత్రం జ్యోతిషంలో నమ్మకం లేదు. రామశర్మ జయంతుని చెయ్యి చూచి, "ఇతని చేతిలో దురదృష్ట రేఖ లున్నాయి. ఇతనికి ధనం ఇచ్చినా ముట్టదు. ఇతడిని ఎవరూ బాగుపరచలేరు. ఇది "విధివ్రాత!" దీనిని తప్పించటం ఎవరితరమూ కాదు!" అని రాజుకు చెప్పి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

దాంతో విజయసేనుడి అహం దెబ్బతింది! "నేను రాజాను కదా! నావద్ద డబ్బుకు, అధికారానికి లోటు లేదు. నా సంపద గొప్పదా? ఈ జ్యోతిషం గొప్పదా? ఈకని దారిద్ర్య పరిస్థితి మార్చలేనా?" అనుకున్నాడు.

మర్నాడు మహారాజు ఒక లేఖవ్రాసి తన నౌకరును పిలిచి, "జయంతా! దీనిని రామవరం తీసుకుపోయి, అక్కడి గ్రామాధికారి వీరాస్వామి వర్మకు ఇచ్చిరా!" అని దారి ఖర్చులకు నాలుగు రూపాయులిచ్చాడు.

జయంతుడు ఆ నాలుగు రూపాయలు తీసుకుని ఇంటికివచ్చి "నే నీ నాలుగు రూపాయలతో మూడు కోసుల దూరంలో వున్న వూరు ఎలా వెళ్ళిరాను? రాజుగారు ఆ మాత్రం ఆలోచించ నవసరంలేదా ఇది కూడా తెలియదా ఆయనకు?" అనుకున్నాడు అంతలోనే అతని స్నేహితుడు రామప్ప వచ్చాడు. రామప్పతో జయంతుడు రాజుగారి ఆజ్ఞ వివరించాడు.

"ఓ! తప్పక వెళ్లిరావలసిందే, నేనైతేనా! నాలుగు రూపాయలు యివ్వకపోయినా వెళ్ళి వచ్చేవాణ్ణి. రాజుగారు మనకు పనిచెప్పడమే గొప్ప అదృష్టం ఆయన దృష్టి మనమీద పడడమే సౌభాగ్యం! !" అన్నాడు రామప్ప.

"అయితే, నువ్వు వెళ్ళిపోయి ఈ ఉత్తరం

రామవరం, గ్రామాధికారి వీరాస్వామికి యిచ్చి రా. ఈ నాలుగులోను రెండు రూపాయలు ఇస్తాను" అన్నాడు జయంతుడు.

రామప్ప సంతోషంతో గంతులువేసి వెంటనే రామవరం వెళ్ళి గ్రామాధికారిని కలుసుకుని ఆ ఉత్తరం ఇచ్చాడు. అనుకో కుండా రాజుగారు వుత్తరం ఎందుకు వ్రాశారో అర్థం కాలేదు వీరాస్వామికి కాని లేఖను చదివిన మీదట అతని ముఖం సంతోషంతో వికసించింది.

"రావయ్యా! రా! లోపలికి రా! ఇవాళ ఎంతో సుదినం, ముందు స్నానం చెయ్యి. ప్రయాణంచేసి బాగా అలసిపోయి వుంటావు. తరువాత భోజనం చేద్దువుగాని" అన్నాడు. రామప్ప స్నానంచేసి, సుష్టుగా భోజనం చేశాడు. గ్రామాధికారి తన భార్యకు రాజు వ్రాసిన ఉత్తరంలోని సంగతులు వివరించాడు

"వీరాస్వామి! ఇతనికి నీ కుమార్తెనిచ్చి పెళ్ళి చెయ్యి నేను ఒక గ్రామాన్ని యితనికి యిస్తాను నీ కుమార్తె సుఖపడతుంది అంత కంటె నీక్కావల్సిందేముంది?' అదీ రాజు వ్రాసిన లేఖ సారాంశం! తెల్లవారగానే వీరాస్వామివర్మ మహావైభవంగా తన కుమార్తె నతనికిచ్చి పెళ్ళి చేశాడు

మరుసటినాడు ఉదయం రాజు నిద్ర నుంచి మేల్కొని బయటకు వచ్చేసరికి జయంతుడు మామూలుగా కూర్చునే చోటనే కన్పించాడు రాజు 'వూరికి వెళ్ళలేదా నువ్వు?" అని అడిగాడు,

"మహారాజా! తమ లేఖను నా స్నేహితుడి ద్వారా అప్పుడే పంపివేశాను" అన్నాడు జయంతుడు. మారు మాట్లాడలేదు రాజు

గ్రామాధికారి కుమార్తెను వివాహమాడి రామప్ప తిరిగి రాగానే రాజు తన వాగ్దానం ప్రకారం అతనికొక గ్రామాన్ని, కొంత డబ్బును యిచ్చాడు. అది చూసి జయంతుడు "నే నెంత దురదృష్టవంతుడను!" అని చింతించాడు.

రాజు మరోసారి జయంతుని స్థితి మార్చ డానికి ప్రయత్నించా లనుకున్నాడు. ఒక బొప్పాయి పండులో అతి నేర్పుగా కొన్ని రత్నాలను చొప్పించి దానిని జయంతుని కిచ్చాడు.

అది పచ్చిగా వున్నట్లు కనిపించడంతో రాజ భవనంనుండి బయటికి రాగానే జయంతుడు 'ఈ పచ్చి బొప్పాయి పండు నేనేం చేసుకుంటాను?' అని చిరాకు పడ్డాడు.

అంకలో పొరుగింటి చందనుడు "ఏం జయంతా! పచ్చి బొప్పాయి కాయ నేమి చేసుకుంటావు పండన్నా అయితే హాయిగా తినవచ్చు" అన్నాడు.

"అమ్మేస్తాను. నీకు కావాలా? నాలుగణా లిస్తే చాలు" అన్నాడు జయంతుడు. చందనుడు మగ్గపెడితే పిల్లలు తింటారని భావించి, దానిని కొని ఇంటికి తీసుకెళ్ళాడు. అతని భార్య "ఇది మగ్గిన పండే పైకి మాత్రం అలా కనిపిస్తుంది" అంటూ కోసింది. ఘల్లు మని వజ్రాలు, రత్నాలు రాలాయి.

"అహా! ఎంత అదృష్టం!" అనుకొని సంతో షించారు ఆ దంపతులు.

జయంతుడు మర్నాడు రాగానే అతని ముఖం మామూలుగానే వుండడం చూచి "బొప్పాయి పండునేం చేశావు?" అన్నాడు మహారాజు.

"మా పొరుగింటి చందనుడికి నాలుగు అణాలకు అమ్మేశాను రాజా!" అన్నాడు, జయంతుడు మామూలుగా.

"ఓరి నిర్భాగ్యుడా!" అనుకున్నాడు రాజు తనలో. ఆ బొప్పాయి పండులో తాను వజ్ర వైడూర్యాలు దాచి ఇచ్చిన సంగతి వెల్లడించాడు. జయంతుడు బాధపడుతూ - రామప్ప గ్రామాధికారి కూతుర్ని, జాగీరును పొందడం, బొప్పాయిపండులోని రత్నాలు పొంది చందనుడు సుఖపడటంచూచి జయంతుడు కృంగి పోయాడు.

ఈసారి రాజు తనకు పని పురమాయిస్తే ఎవరికీ అప్పగించకుండా ఆ భాగ్యం తానే పొందాలనుకున్నాడు, రాజు మర్నాడు ఒక లేఖ యిచ్చి దీనిని దండనాధికారికి ఇచ్చి రమ్మన్నాడు.

"వీడు రెండుసార్లు నా ఆజ్ఞ మీరి ప్రవర్తించాడు. వీణ్ణి కారాగృహంలో బంధించు" అని ఆ లేఖలో వ్రాసివుంది. లేఖను చదివి జయంతుని కారాగృహంలో బంధించాడు దండనాధికారి.

జ్యోతిష శాస్త్రం గొప్పతనం అప్పటి కర్థమయింది రాజుకి. ఆ రోజు జ్యోతిష్యుడు జయంతుని హస్తరేఖల్ని చూచి చెప్పినదంతా సరిగానే జరిగింది. అతడిని బాగుచేయటం తనవల్ల కాలేదు. తను అతనికి అదృష్టం కలిగించా లనుకున్నప్పుడు అతడు మూర్ఖంగా ప్రవర్తించాడు శిక్ష విధించేటప్పుడు మాత్రం ఆజ్ఞ తప్పక పాటించాడు. అప్పటినుండి రాజు జ్యోతిష శాస్త్రాన్ని నమ్మసాగాడు.



# నిజం చెప్పిన నేరం

ఒక ఊరిలో సాంబయ్య, శివయ్య అనే యిద్దరు మిత్రులు వుండేవారు. సాంబయ్య ఎప్పుడూ అబద్ధాలు చెప్పే స్వభావం కలవాడు, శివయ్య ఎల్లప్పుడు నిజమే చెప్పే అలవాటు కలవాడు ఇద్దరూ స్వగ్రామంలో సరిగా జీవనోపాధి దొరకక దేశాంతరం బయలుదేరారు అలా కొంతకాలం పయనించి వారిద్దరు ఒక చిన్న రాజ్యం చేరుకున్నారు. ఆ రాజ్యంలోని ప్రజల ముఖాలంతా కోతుల ముఖాల్లా గున్నాయి. అదో జాతివారు కాబోలు అనుకున్నారు వారు యింతలో కొందరు రాజ భటులు వచ్చి క్రొత్తవారిలా గున్న స్నేహితు లిద్దర్నీ పట్టుకొనిపోయి తమ రాజు ముందు హాజరు చేశారు "ఎవరు మీరు? ఎందుకొచ్చారు. యిక్కడకు" అని అడిగాడు రాజు, తమ సంగతి వినయంగా చెప్పుకున్నారు శివయ్య సాంబయ్యలు.



"అలాగైతే కొన్నాళ్ళు మా అతిధులుగా వుండండి మీ రిద్దరు ఆ తరువాత ఏమన్నా వుద్యోగాలు యిస్తా'నన్నాడు రాజు. 'చిత్తం!" అన్నారు యిద్దరూ.

అలా కొన్నాళ్ళు గడిచాక తిరిగి తన దర్బారుకు పిలిపించాడు శివయ్య, సాంబయ్యల్ని [illegible] నా రాజ్యాన్ని గురించి, నన్ను గురించి మీరెలా భావించుకుంటున్నారు?" అని వారి అభిప్రాయం కోరాడు రాజు.

వెంటనే అబద్ధాలకోరు అయిన సాంబయ్య "మహాప్రభో! మీ రాజ్యం వంటి సుభిక్షమైన రాజ్యం యీ భూమండలంలో లేదు. యిక మీవంటి సత్య ధర్మ గుణం గల రాజు పదునాలుగు భువనాల్లో లేడు" అని గొప్పగా పొగిడాడు. అతని పొగడ్తకు ఎంతో సంతోషపడిన రాజు ఎన్నో బహుమతులిచ్చి మంచి వుద్యోగం యిచ్చి సత్కరించాడు.

అబద్ధం చెప్పిన సాంబయ్యనే అంత గొప్పగా సత్కరించిన రాజు నిజంచెప్పే నన్ను యింకా ఎక్కువగా సత్కరిస్తాడనుకున్న శివయ్య, 'మహారాజా! కోతుల రాజులోనే గొప్ప కోతి రాజు మీరు ప్రపంచ ప్రజల్లోకెల్లా మీ కోతి ప్రజ చాలా మంచి ప్రజ' అన్నాడు.

నిజాన్ని నిజంగా చెప్పిన శివయ్య పొగడ్త కోతి రాజుకు భలే కోపాన్ని తెప్పించింది. వెంటనే సేవకుల్ని పిలిచి "పిచ్చి లాక్కెళ్ళి చీకటి కారాగారంలో వేయండి' అని ఆజ్ఞాపించాడు

# మకర ద్వీపం





5

[ జరిగిన కథ: మహారాజు హిరణ్య సింహుడి కోరిక ప్రకారం మకరద్వీపానికి బయలుదేరిన వీరబాహు, రాజసింహుడు, వసంతరాయలు ఓడ ప్రమాదంవల్ల విడిపోయ్యారు. రెక్కల గుర్రం మీద వసంతరాయలెటో పోయాడు. ఒక దీవికి చేరుకున్న వీరబాహు, రాజసింహుల్ని కొండజాతి వాళ్ళు బలివ్వబోగా, పద్మనాభుడు గుర్తించి నాయకుడి వద్దకు తీసికెళ్ళాడు. గుర్రం మీదనుండి దూకిన వసంతరాయల్ని ఓ వింత మృగం లాక్కెళ్ళింది. వీరబాహు, రాజసింహు లిద్దర్నీ కోలాటులు బంధించగా, ఎలాగో తప్పించుకుని, వాళ్ళ నాయకుడైన అశ్వకర్ణి యింట్లోకి చేరారు ఇక చదవండి ]

లోపల ఐదుమంది ఆడవాళ్ళు అర్ధనగ్నంగా పడుకొని ఉన్నారు. బయట అంత కోలాహలం జరిగినా వాళ్ళకి మెళకువ రాలేదు. వాళ్ళ మధ్య అజానుబాహు వైన ఒక వ్యక్తి అదమరచి నిద్రిస్తున్నాడు.

“అతడు ఈ కోలాటుల నాయకుడు అశ్వకర్ణి అతని ప్రక్క నున్నవారు, అతడి భార్యలు, లేదా ఉంపుడుకత్తెలు కావచ్చు. అతిగా మద్యాన్ని సేవించడంవల్ల వీళ్ళు ఇలా తయారయ్యారు.” అన్నాడు వీరబాహు.

రాజసింహుడు అశ్వకర్ణిని తట్టి లేపాడు. బద్ధకంగా కళ్ళు తెరిచాడు. తన ఎదురుగా ఆయుధపాణులై నిలబడి ఉన్న వీరబాహు రాజసింహులనిచూస్తునే అతగాడికి నిద్రమత్తు పూర్తిగా తొలగిపోయింది. అతడి నోరు బలంగా మూశాడు రాజసింహుడు. తన అంగరఖా లోంచి తాళ్ళు తీశాడు. ఇంతకుముందు ఆ తాళ్లు అతడి శరీరాన్ని అంటి పెట్టుకొని

---

రచన: సి. సుబ్బరామిరెడ్డి, కడప.

ఉండేవి. వాటితో అతడి చేతులు గట్టిగా వెనక్కి విరిచి కట్టాడు వీరబాహు.

నెమ్మదిగా అతడిని నడిపించుకుంటూ సింహద్వారం గుండా వెలుపలికి వచ్చారు వాళ్ళు.

గట్టిగా కేక వేశాడు వీరబాహు గుంపులు గుంపులుగా రణ గొణ ధ్వనులు చేసుకుంటూ వచ్చారు కోలాటులు.

"ఆగండి! కదలకండి!! చూశారా. మీ నాయకుడిని? మీరు ఏమాత్రం అఘాయిత్యం తలపెట్టినా మీ నాయకుడిని కత్తితో కండగా చీలుస్తాం" చెప్పాడు వీరబాహు. ఇద్దరి చేతుల్లోని కత్తులు వెన్నెలలో తళ తళా మెరుస్తున్నాయి. ఎక్కడి వాళ్ళక్కడే ఆగిపోయారు.

"మీరు మా వెంట పడకుండా, మాకే విధమైన అపాయాన్ని కల్గజేసుకుండా ఉంటే, మీ నాయకుడిని మాతో కొంత దూరం మాత్రం తీసుకుపోయి వదలివేస్తాం" అన్నాడు రాజసింహుడు.

నెమ్మదిగా అశ్వకర్ణిని నడిపించుకుంటూ వెళ్ళిపోయారు వాళ్ళు.

చుట్టూ చీకటి! కళ్లు చించుకొని చూసినా ఏమీ కన్పించడం లేదు. గాలి కూడా సరిగా రావడం లేదు. వసంతరాయల్ని పట్టుకున్న మృగం వేగంగా పరుగిడుతోంది. వున్నట్టుండి పెద్ద వెలుగు... వసంతరాయలికి స్పృహ పోయింది. ఆ మృగం అతడిని క్రిందపడ వేసింది.

ఒక వృద్ధుడు అటుగా వచ్చాడు. శరీరం పాలిపోయి ఉంది. అతడి వయస్సు డెభై సంవత్సరాలకి తక్కువ వుండదు. నడుము



వంగిపోయి వుంది. భూమికి తగులుతున్నట్లున్నది, అతడి పొడవైన తెల్లటి గడ్డం, తల, కనుబొమలు పూర్తిగా నెరసిపోయాయి. నారపీచులా ఉందతని జుట్టు. అతని కళ్ళు గాజు గోళాల్లాగా మెరిసి పోతున్నాయి. అతడు నోటితో మంత్రోచ్చాటన చేస్తున్నాడు. అక్కడ భయంకరమైన కాళికా దేవి విగ్రహం ఉంది. పన్నెండు చేతులతో; చేతికొక ఆయుధంతో ప్రళయ తాండవం చేస్తున్నది దేవి విగ్రహం.

చేతిలోని ఊతకర్రని ప్రక్కనపెట్టి క్రింద కూర్చున్నాడా వృద్ధుడు... కమండలంలోని నీళ్ళని వసంతరాయలు ముఖంపై చల్లాడు. మెల్లగా కళ్ళు తెరచి చూశాడు. ఎదురుగా ఉన్న ముసలివాడు భయంకరంగా కన్పించాడు. డిగ్గునలేచి కత్తి దూశాడు.

అతను నవ్వాడు. నవ్వుతూ సూటిగా



వసంతరాయల కళ్ళలోకి చూశాడు "ముసలి వాడిపైననా నీ కోపం? నేను నిన్నేం చేయగలను?' అన్నాడు. ఆతడి మాటల్లో ఏదో వాత్సల్యం గోచరించింది వసంతరాయలకి.

"ఎవరు మీరు? ఎందు కిలాంటి నిర్జన ప్రదేశంలో ఉంటున్నారు? నన్నిక్కడకు తెచ్చిన వింత మృగం ఏమైంది?" అని ప్రశ్నల వర్షం కురిపించాడు.

'ముందు సేద తీర్చుకో నాయనా!..." "విజయకేతూ! ఈదినం కోసి తెచ్చిన ఫలాలని తీసుకురా" అన్నాడు.

మధ్య రెండు శిరస్సులతో ఎత్తి పట్టి పండ్ల బుట్టను వసంతరాయల ముందు పెట్టింది వింత మృగం. దాన్ని చూసి ఆశ్చర్యపోయాడు వసంతరాయలు. నోరు తెరచి ఏదో అడగబోయాడు.

"నీ అనుమానం నాకు తెలుసు. ముందు సంకోచించకుండా ఫలహారం కానివ్వు" అన్నాడు వృద్ధుడు. ఆకలితో ఉన్న వసంతరాయలు అవు రావురుమని ఫలహారాన్ని మింగించాడు.

"ఇప్పుడు చెప్పండి" అన్నాడు వసంతరాయలు వృద్ధుడు చెప్పడం అరంభించాడు.

"నా పేరు నరసింహరాయలు. దేవగిరి దుర్గాధిపతిని నేను. మహారాజు దేవసింహుడికి చాలా అప్తుడిని. నా భుజబలంతో చాలా సామ్రాజ్యాన్ని అతడికి సంపాదించి పెట్టాను అతడికి కుడి భుజంలా ఉంటూ, అతని సామ్రాజ్యం వైపు శత్రువులు కన్నెత్తి గూడా చూడలేనంత కట్టు దిట్టాలను చేశాను. నా భార్య యుక్తిమతి అమెకి నామాటన్నా, నేనన్నా దైవ సమానం ఏనాడు నామాటకి ఎదురాడి ఎరుగదు. నాకు చాలా కాలం వరకూ సంతానం కలగలేదు. నా నడివయస్సులో, అంటే నా నలు వదియవఏట నా భార్య కవల పిల్లలని ప్రసవించింది. పుట్టిన యిద్దరూ మగపిల్లలే నా సంతోషానికి అంతులేక పోయింది. అంతలోనే దుఃఖదేవత నన్ను వరించింది. పాతిక సంవత్సరాలు నాపాటి దేవతగా, నా చేయుతగా నిల్చిన నా గృహలక్ష్మి నన్ను విడిచి వెళ్ళిపోయింది. ఆమె మరణం నన్ను దాదాపు పిచ్చి వాడిని చేసింది.

నేను మంత్ర వాడిని మంత్రవిద్యంటే నాకు చాలా ఇష్టం నేను అవివాహితుడిగా వున్నప్పుడే మంత్రాభ్యాసం చేసే వాడిని నా భార్య పోయాక నాకు వేరే ధ్యాస లేకపోయింది.

మంత్ర తంత్రాలలో క్రొత్త క్రొత్త ప్రయోగా లను చేసేవాడిని.

కుబేర దత్తుడు నా మిత్రుడు అతని తండ్రి కొంతకాలం రాజధానిలో వుండి వున్నాడు. నేను నా విద్యాభ్యాసాన్ని రాజధానిలోనే పూర్తి చేశాను. అప్పుడు కుబేరదత్తుడు నాకు సహపాఠి. మేమిద్దరం చాలా సన్నిహితమిత్రులం ఒకరి రహస్యాలు ఒకరం దాచుకునే వాళ్ళం కాదు. నా భార్య చనిపోయినప్పుడు నన్ను ఓదార్చిన వాళ్ళలో ముఖ్యుడు కుబేర దత్తుడు. అడపా దడపా అతడు నావద్దకి వచ్చి వెళ్తుండేవాడు. అతడు నేను మంత్రాభ్యాసం చేసేది చూచి నన్ను ప్రోత్సహించాడు. ఒక సారి అతడు నాకు మలయా ద్వీపాన్ని, అక్కడి మంత్రగాళ్ళని గూర్చి వివరించి చెప్పాడు. ఒకసారి తనతో రమ్మని, అక్కడి తన మిత్రులు గొప్ప మంత్రవాదులని వాళ్ళని నాకు పరిచయం చేస్తానని చెప్పాడు.

అప్పుడు నా కొడుకులకు నాల్గు సంవత్సరాలు, నా కొడుకులలో ఒకడైన విజయకేతు నన్నెప్పుడు విడిచి ఉండేవాడు కాడు. కుబేరదత్తుడి తండ్రి నా చిన్నతనంలో మా రాజధానిలో వుండేవాడని చెప్పాను గదా! కొంత కాలం తర్వాత వాళ్ళు ఉత్తరాదిలో స్థిరపడిపోయారు. అతని తండ్రి తరువాత కుబేరదత్తుడు వ్యాపారం చేయడం సాగించాడు. పెద్ద ఎత్తున సముద్రాలపై వెళ్ళి వ్యాపారం చేసేవాడు. తండ్రి సంపాదించిన లక్షలని కోట్లుగా మార్చి అభినవ కుబేరుడని అని పించుకున్నాడు.

మలయాద్వీపం గురించి కుబేరదత్తుడు నాతో చెప్పినప్పటి నుండి నాకు అక్కడకు వెళ్ళాలనే కుతూహలం ఏర్పడింది. రాజుగారి వద్ద సెలవు తీసికొని నా నాలుగేళ్ళ కొడుకు విజయకేతుని తీసుకొని కుబేరదత్తుని వెంట బయలుదేరాను. అతడు నన్ను మలయా ద్వీపంలో విడిచి వెళ్ళాడు. నేను చాలా మంత్రాలని నేర్చుకొన్నాను నాకు తెల్సిన వాటిని వాళ్ళకి నేర్పాను కుబేరదత్తుడు తిరిగి





వచ్చేటప్పుడు నన్ను ఓడలో ఎక్కించుకున్నాడు

ఓడ బయలుదేరింది అవి అమావాస్య రోజులు. ఓడసరంగు అజాగ్రత్తవల్ల ఓడ దారి తప్పింది. అది అర్థరాత్రికిగాని తెల్సిరాలేదు మా ఓడ నీటి అడుగున వున్న కొండ శిఖరానికి కొట్టుకొని ముక్కలు, చెక్కలైంది. నేను నా ఒడిలో నిద్రిస్తున్న నా పెద్దకొడుకు విజయకేతు నీళ్ళలో పడ్డాము విజయకేతును వీపు పైన వేసుకుని దాదాపు ఒకరోజు ఈదాను. ఈ దీవి చేరుకున్నాను.

ఆ నా విజయ కేతే ఈ వింత మృగం నా చిన్న కొడుకు వసంతరాయలు. నీవే నాయనా! ఆ వసంత రాయులివి" అన్నాడా వృద్ధుడు ఆనందంతో అతడి కంఠం బొంగురు పోయింది. కళ్ళనుండి ఆనంద బాష్పాలు ధారాపాతంగా ప్రవహిస్తున్నాయి. గాజు గోళాల్లాంటి ఆ కళ్ళు వింతగా మెరుస్తున్నాయి,

"నాన్నా" ఆనందోద్వేగాశ్చర్యాలలో తబ్బిబ్బు పడుతూ తండ్రిని కౌగిలించుకున్నాడు వసంతరాయలు.

ఆనందంతో తల వూపసాగింది వింత మృగం.

"అన్నా" అంటూ ఆవింత మృగం తలలని కౌగలించుకున్నాడు. "నా అన్న అలా అవడానికి కారణమేమిటి వివరించండి" అని అడిగాడు వసంతరాయలు.

* * * *

అశ్వకర్ణి డొక్కని రాజసింహుడి కత్తిమొన అనుకొని వుంది. అతడి కిరువైపులా వీరబాహు రాజసింహు లున్నారు. అశ్వకర్ణి దిగులుగా అటూ యిటూ చూడసాగాడు. అదను చిక్కితే పారిపోయేట్టుగా వుందతని వాలకం అతని పరిస్థితి చూసి చిన్నగా నవ్వాడు వీరబాహు.

"అశ్వకర్ణి! పారిపోయేందుకి ప్రయత్నించకు. నీవు ఏమాత్రం నసిగినా నీ శరీరం తూట్లవుతుంది జాగ్రత్త" అన్నాడు.

"వీరబాహు! వీడెంత జిత్తులమారో, వీడి అనుచరులు గూడ అంతటి వాళ్ళు, మనల్నింత తేలికగా వీళ్ళు వదలి పెడతారన్నది కలలోని మాట మనలని అనుసరించే ప్రయత్నంలోనే వుంటారు. అంతేకాదు. ఈ కొండ మార్గాల్లో అడ్డదారులు చాల వుంటాయి. అవన్నీ మనకు తెలియవు ఏదో ఒక దగ్గరి దారి గుండా మనకంటే ముందు వెళ్ళి మాటు వేసి వుంటారు" అన్నాడు రాజసింహుడు.

"ఐతే ఏమి చేద్దామంటావు?" అని ప్రశ్నించాడు వీరబాహు ఇద్దరు నడుస్తూ మాట్లాడుకొంటున్నారు. ఎత్తుగా వున్న చెట్లలో నుంచి అడ్డంగా నడిచి వెళ్తున్నారు. అక్కడక్కడా అడ్డు వచ్చే తుప్పలని కత్తితో నరికేస్తున్నాడు వీరబాహు. అలా కొంత దూరం వెళ్ళి ఆగిపోయింది. కాలిబాట. ముందుకి చూశారు ముగ్గురూ. అగాధం! ఎటూ వెళ్ళేందుకి వీలు లేదు. వెడితే వెనక్కి వెళ్లాలి. క్రిందకి వంగి చూశాడు వీరబాహు. దాదాపు వేయి అడుగుల లోతు వుంది. అడుగున నీటి గలగలలు. వెన్నెలలో నీరు తళ తళా మెరుస్తోంది. విశాలమైన యిసుక మేటలు ఇసుక తిన్నెల అవలి వైపున రక్కసి పొదలు, ఎత్తయిన రకరకాల వృక్షాలు.

"వీడి కాళ్ళు చేతులు కట్టి ముందు ఈ లోయలో పడవేద్దాం." అన్నాడు రాజసింహుడు పండ్లు కొరుకుతూ అశ్వకర్ణినిచూసి, ఆమాట వింటూనే అదిరిపోయాడు అశ్వకర్ణి ఏడుస్తూ వీరబాహు కాళ్ళపై పడ్డాడు. నిలువునా వణికి పోతున్నాడు వాడు.

'ఇదేమిటి వీడు ఇలా వణికి పోతున్నాడు! ఈ దీవిలో కోలాట జాతివాళ్ళు చాలా బలవంతులని అంటారే! వీడికంటే ఆ భైరవ జాతి వాళ్ళే నయం," అన్నాడు వీరబాహు రాజసింహుడిని చూస్తూ.

"నిన్నేమీ చేయకుండా వుండాలంటే ఒక షరతు. ఈ లోయ, ఇందులోని పరిస్థితులని వివరించిచెప్పు నీ మాటల్లో అసత్యం ఏమాత్రం గోచరించినా నీ శరీరాన్ని ఈ లోయలోని బండరాళ్ళు ముద్దు పెట్టుకుంటాయి" అన్నాడు రాజసింహుడు

"ఇది భేతాళలోయ ఈ లోయలో ప్రవహించే ఆ నదిపేరు కుముదిని ఈ లోయలో భయంకరమైన సర్పాలున్నాయి అతి భయంకరమైన క్రూర మృగాలకి అటపట్టువి" అన్నాడు.

(ఇంకా వుంది)







# దొంగలు చేసిన మేలు

కొండపల్లి గ్రామంలో రామయ్య అనే వ్యక్తి ఉండేవాడు. ఆ గ్రామంలో అతడే గొప్ప రైతు. ఆ వూరులో ఏ చిక్కు వచ్చినా అతడు నేర్పుతో పరిష్కరించేవాడు. గ్రామస్థులు కూడా ఏ ఆపద వచ్చినా రామయ్యవద్ద కెళ్ళి తీర్పు చెప్పమని మొరపెట్టుకొనేవారు.

ఒకసారి పెద్ద దొంగల ముఠా ఒకటి కొండపల్లి గ్రామం మీద పడి దోచుకోసాగింది. ఎన్ని విధాల ప్రయత్నించినా దొంగలబారినుండి తప్పుకోలేక పోయారు ప్రజలు. ఒకనాడు గ్రామస్థులు రామయ్య ఇంటికెళ్ళి ఆయనతో దొంగల బాధ గూర్చి చెప్పుకొని ఘోరున విలపించారు.

పాపం, రామయ్యకూడా ప్రజల దుస్థితికి చాలా విచారించాడు. గ్రామస్థులకు ఏదో సమాధానంచెప్పి రామయ్య ఒకటే బాధ పడేవాడు. రామయ్య భార్య రంగమ్మ, భర్త ఆవేదన చూడలేక పోయింది. ఒకనాడు ఆమె భర్త చెవిలో ఏదో చెప్పి, "మనం ఇలాచేస్తే ఈ దొంగల పీడ వదులుతుంది" అంది. రామయ్య సరేనన్నాడు. రంగమ్మ అనుకున్న ప్రకారమే దొంగల ముఠా ఒకనాటి రాత్రి రామయ్య ఇంట్లో జొరబడింది. రంగమ్మ దొంగలను అట్టే కనిపెట్టేసి "ఏమండీ! మన గ్రామానికి దొంగల బెడద జాస్తి అయింది. ఎక్కడ పడితే అక్కడ ఇళ్ళు దోచేస్తున్నారు. మీరు నా మాట వినరు. మీ అమ్మవి, కాసుల హారాలు, బంగారు వడ్డాణం, మీ బామ్మగారివి బంగారు కడియాలు, తులెడన్ని వెండి రూపాయలు దొంగల బెడద తగ్గేవరకూ మన బంధువుల ఇంట్లో చేర్చ కూడదా?" అంది.

దానికి రామయ్య "ఓసి పిచ్చిదానా, నేనేమి అంత తెలివితక్కువవాణ్ణి అనుకొన్నావా? ఈ దొంగల బాధ పసిగట్టి ఎప్పుడో నగ, నట్రా అంతా సంచులలో వేసి గంగమ్మ గుడి ముందరుండే మన కరణంగారి భూమిలో పాతి పెట్టాను. నీవు మరేం కంగారు పడక హాయిగా పడుకో" అన్నాడు.

ఈ మాటలు విన్న దొంగల నాయకుడు మెల్లగా అక్కడనుంచి జారుకున్నాడు. తక్షణమే ఎక్కడెక్కడోనున్న తన ముఠావారి నందర్నీ పిలిపించి వారికి ఈ విషయంచెప్పాడు.

అందరూ నాయకుడు చెప్పిన దానికి సంతోషించారు. దొంగలంతా ఈ గొడవలో పడేటప్పటికి ఊరిలో దొంగతనాలు తగ్గుముఖం పట్టాయి. ప్రజలుకూడా చాలా ఆశ్చర్యపడి

సురభి రేవతి, మదనపల్లి

పోయారు. దొంగలంతా కలసి కరణంగారి ఇంటికెళ్ళారు.

ఇంతమంది జనాన్ని చూస్తూనే కరణం గారు ఆశ్చర్యపడి 'ఏమి నాయనా! ఏం పనిమీద వచ్చారు? మీకు ఏం కావాలి?', అన్నాడు. "ఏమీ లేదు బాబూ! మా ప్రాంతంలో పెద్ద కరువు సంభవించింది. తినటానికి తిండి లేక త్రాగడానికి నీళ్లు లేక, ఏదో కూలీ, నాలీ చేసుకొందామని ఈ ఊరికి వచ్చాము. తమరు మామీద దయయుంచి గంగమ్మ గుడిముందరుండే మీ భూమి మాకు క్రయానికి ఇవ్వండి, ఇన్ని కొంపలు కట్టుకొని జీవించుకుంటాము' అంటూ బోలెడన్ని వెండి రూపాయలు కరణం ముందర కుమ్మరించారు. ఆ డబ్బు చూస్తూనే కరణంగారు ఎంతో సంతోషించారు. ఎన్నాళ్ళనుండో పంటలు పండక బీడుగా వుండిన ఆ భూమి క్రయం అయిందంటే కరణంగారికి ఆశ్చర్యమేసింది. తక్షణమే ఆ భూమి దొంగలకు అమ్మేశాడు భూమిని కొన్న మరుక్షణమే దొంగలు తాము ముందు ఆర్జించుకొన్న దొంగ డబ్బుతో బత్తెము వగైరాల కొని రేయనక పగలనక, త్రవ్వటం మొదలెట్టారు. అక్కడ పెద్ద బావి అయింది. నెలల తరబడి త్రవ్వారు రామయ్యగారి పిత్రార్జితం సొత్తు దొరకలేదు. గాని పుష్కలంగా నీళ్ళు పడ్డాయి. దొంగలు కొన్న బత్తెము, వగైరాలు అయిపోయాయి. ఇంకా త్రవ్వాలంటే నీళ్లు బయటికి వెళ్ళాలి వీళ్లకు తిండి, తీర్థం కావాలి. ఇక సుఖం లేదనుకొన్నారు ఫలితం శూన్యమయ్యేటప్పటికి తమలో తామే పోట్లాడుకొన్నారు. తత్ఫలితంగా వాళ్లలో ఐకమత్యం పోయి చెల్లాచెదరయి పోయారు

రంగమ్మ పుణ్యమా అని పనికిరాని కరణంగారి చేను అమ్ముడు బోయింది. ఊరి ప్రజలకు చక్కటి మంచినీళ్ల బావి తయారయింది. ఊరికి దొంగల బాధ పోయింది. తర్వాత రామయ్య జరిగిన కథ గ్రామ ప్రజలకు చెప్పితే, ప్రజలంతా రామయ్యను, రంగమ్మను ఎంతగానో పొగిడారు.



# మహాభారతము 63

సావిత్రి చేతులు జోడించి "మా మామగారు మహాత్ముడైన రాజర్షి. ఆయన శత్రువులచేత అపజయం పొంది కష్టములు పడుచున్నాడు. కన్నులు కూడ లేవు, ఆయనకు నేత్రదానము చెయ్యి" అన్నది. ఆతడు "అట్లాగే ఇస్తున్నాను. ఇక నీవు నావెంట రావలదు" అన్నాడు. యముడు ముందునకు సాగగా ఆమె కూడా వెంట సాగింది. యమునివెంట చని చని "మహాత్మా! నీవు ధర్మదేవతవు. నీవు సమవర్తివి. సర్వ జీవులందు యమించు వాడవు. నీ అనుగ్రహము నాయందు ప్రవృద్ధమగును గాక" అన్నది. ఆమె మాటలకు సంతసించి యముడు 'అమ్మాయీ! నీ మాటలు చక్కగా నున్నవి. నీ భర్త ప్రాణము దక్క వేరొక వరము కోరుకో. ఇస్తాను" అన్నాడు. ఆమె "నా మామగారికి తన రాజ్యము తిరిగివచ్చునట్లు అనుగ్రహింపుము" అన్నది. యముడు సరేనని "నీ విక రావలదు. ఇది చాల కష్టమైన త్రోవ" అన్నాడు. సావిత్రి "తండ్రీ! నీవు ధర్మాధ్యక్షుడవు. ధర్మాత్ములు తామవలంబించిన కార్యము పూర్తియగు వరకు విడవరు కదా! ఎన్ని కష్టములు వచ్చినను ధర్మమును తప్ప రాదు' అన్నది.

యముడు "అమ్మాయీ! నీవు ధర్మ తత్పరవు, నీ కింకొక వరమిస్తున్నాను. కోరుకో నీ భర్త ప్రాణము మాత్రము కోరరాదు' అన్నాడు. ఆమె "నా తండ్రికి కుమారులు లేరు. ఆయనకు నూరుమంది పుత్రులనిమ్ము" అన్నది. యముడు "అట్లానే"నని చెప్పి. "నీవు చాలా దూరము వచ్చినావు. చాలా బడలినావు. ఇక రావలదు" అన్నాడు ఆ పరమ పతివ్రత "నాకు బడలిక యెక్కడిది? నా మనస్సు నా భర్త చరణ కమలములందున్నది. ధర్మమును తప్పక ఆచరించుట వలన లోకస్థితి



జరుగుచున్నది. కావున నా భర్త వెంట వచ్చి నేను ధర్మమాచరింపక తప్పదు" అన్నది.

యముడు "నీయందు నాకు చాల వాత్సల్య మున్నది. ఒక వరమును కోరుకో ఇస్తాను' అన్నాడు. ఆమె సంతోషముతో "ధర్మమూర్తీ! ఇప్పుడు నీవు నా భర్త ప్రాణములను కోర వద్దని చెప్పలేదు. కాబట్టి నా భర్తను పునర్జీవితుని చెయ్యమని కోరుతున్నాను" అని చేతులు జోడించింది.

యముడు "అమ్మాయి! నీవు మహా పతివ్రతవు. నీ మాట కాదనలేను. నీ భర్త ప్రాణములు తీసుకొని వెళ్లు నీవు అనేక సంవత్సరాలు నీ భర్తతో సకల సౌఖ్యాలను అనుభవించు, నూరు మంది పుత్రులు నీకు కలుగుతారు" అని చెప్పి అంతర్హితు డయ్యాడు. ఆమె శీఘ్రముగా వచ్చి భర్త శిరస్సును తన తొడపై పెట్టుకొని కూర్చున్నది. కొలది సేపటికి సత్యవంతుడు కన్నులు తెరచి లేచి కూర్చున్నాడు. "ప్రియా! నేను చాలసేపు నిద్రపోయినాను. బలవంతుడైన వాడెవ్వడో నన్ను లాగి పట్టుకొన్నట్లున్నది. వాడెవ్వడో చెప్పు అది కల కాదు. నిజమనిపిస్తున్నది' అన్నాడు.

ఆమె "ఇప్పుడిక్కడ చీకటి పడింది. వెంటనే ఆశ్రమానికి వెళ్లుదాము" అన్నది. తల్లి తండ్రులు చీకటిలో ఏమైనారో అని తల్లడిల్లుతూ సత్యవంతుడు భార్యను వెంటబెట్టుకొని ఆశ్రమానికి వచ్చి చేరాడు అంతకు ముందే ఆశ్రమంలో ద్యుమత్సేనునికి కన్నులు వచ్చినవి ఆయనతోనున్న మునులందరు చూచి సంతోషపడిరి సావిత్రీ సత్యవంతులు ఆశ్రమమును చేరగా ద్యుమత్సేనాదులు



సంతోష పడిరి ద్యుమత్సేనుడు కుమారునితో "అడవి యందు ఇంత ఆలస్య మెందులకైనది?" అని ప్రశ్నించాడు సత్యవంతుడు తనకు శ్రమ కలుగుట, తాను విశ్రమించుట అప్పుడొక మహా పురుషుడు తన్ను పట్టుకొని పోవుట మరల కొంతసేపటికి తెలివి వచ్చుట మొదలుగా విషయములను చెప్పినాడు

సావిత్రి మామగారినిచూచి "ఆర్య పుత్రునికీ దినమున మరణ మున్నదని నారదుడు నాకు పూర్వమే చెప్పినాడు. ఆయన మాట అమోఘము కాబట్టి నేను ఏమరకుండా ఈ దినము జాగ్రత్తగా ఉన్నాను. అందుచేతనే భర్త వెంట ఈ దినము అడవికి వెళ్లాను. ఈయన నిద్రించుచున్నవేళ యమధర్మరాజు వచ్చి యీయన జీవమును కొనిపోయాడు, ఆ యమధర్మరాజును నేను వివిధముగా

ధర్మముతో ప్రస్తుతించాను ఆ మహాత్ముడు నాయందు వాత్సల్యముంచి నాలుగు వరము లిచ్చాడు. ఒక వరము వలన నా భర్త తిరిగి జీవించాడు. రెండవ వరము వలన మీకు కన్నులు వచ్చినవి. మూడవ వరము మీకు శత్రువులపహరించిన రాజ్యము తిరిగి వచ్చుట నాలుగవ వరము నా తండ్రిగారికి నూరుమంది కుమాళ్ళు కలుగుట." అని చెప్పినది. ఆమె మాటలకు అత్తమామలు పరమానందభరితులయ్యారు. "తల్లీ! ఆపత్తులలో మునిగిపోయిన నా వంశాన్ని నీ పుణ్య చరితం వలన ఉద్ధరించావు!" అన్నారు. మునులు ఆమెను దీవించారు. కొలదినాళ్ళకు ద్యుమత్సేనుని ఆప్తమిత్రులు మూల భృత్యులు, పౌరులు ఆతనివద్దకు వచ్చి వినయముతో "మహారాజా! నీ శత్రువు భృత్యసహితము మరణించినాడు. ఇప్పుడు ప్రజలంతా ఏక కంఠముతో మిమ్మల్ని రాజ్యపదాన్ని స్వీకరించమని కోరుకుంటున్నారు. మీరు వెంటనే పట్టపు టేనుగ నెక్కి విజయఘోషతో రాజధానికి రండి. తపోబలము చేత పోయిన కన్నులను తిరిగి పొందిన మిమ్ము చూడగలుగుట మా పుణ్య విశేషము," అని విన్నవించారు.

వెంటనే ద్యుమత్సేనుడు అక్కడనున్న మునివరులను పిలిపించి వారల ఆశీస్సులను గ్రహించి భార్యతో కుమారునితో కోడలితో చతురంగ బలసమేతుడై రాజధానికి వెళ్ళి రాజ్యాన్ని స్వీకరించి, ప్రజల సమ్మతితో కుమారుడైన చిత్రాశ్వునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేశాడు సావిత్రీదేవి మహాపతివ్రత ఆమె భర్తను, అత్తమామలను తండ్రి వంశాన్ని తన పాతివ్రత్యము వలన ఉద్ధరించిన పుణ్యమూర్తి."

మార్కండేయ మహర్షి సావిత్రి వృత్తాంతాన్ని చెప్పి "ధర్మరాజా! ద్రౌపది కూడ మహా పతివ్రత. అమె పాతివ్రత్యము వలన మీ కష్టములు తొలగుతవి" అని హిత వచనములు పలికి తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

పాండవుల అరణ్యవాసము పండ్రెండు సంవత్సరాలు ముగిసిపోవుచున్న సమయ



మున ఇంద్రుడు కర్ణుని యొక్క సహజ కవచ కుండలాలను హరించి పాండవులకు మేలు చేయాలని ఆలోచించాడు. ఈ ఆలోచన సూర్యునకు తెలిసింది. ఆయన కర్ణునికి మేలు చెయ్యాలను కున్నాడు. ఒక బ్రాహ్మణ వేషముతో కర్ణుని దగ్గరకు వచ్చి "కర్ణా! నీకు సహజ కవచకుండలము లున్నవి అవి అమృతము వంటివి. అవి ఉండగా నీకు చావు లేదు. అందుచేత పాండవులకు మేలు కోరి ఇంద్రుడు నీ సహజ కవచకుండలాలను హరించడానికి రాబోతున్నాడు. బ్రాహ్మణులు దేనిని అడిగినా నీవు తప్పక ఇస్తావు. అందు చేత బ్రాహ్మణ వేషముతో వచ్చి నిన్ను కవచ కుండలము లివ్వమని ప్రార్థిస్తాడు. నీవు ఇవ్వ వద్దు. అతనిని అశేష గోహిరణ్యాది సంభారా లతో సంతోషపెట్టు" అని చెప్పాడు.

కర్ణుడు "మహాత్మా! నీవు బ్రాహ్మణ వేష ములో వచ్చిన దేవతవలె నున్నావు నీ వెవ్వ రవో తెలుపుము" అని కోరాడు. బ్రాహ్మణుడు తాను సూర్యుడనని చెప్పాడు కర్ణుడు ఆయన్ను పూజించి "లోకత్రయదీపా! నీవు చేసిన హితబోధకు నేను కృతజ్ఞుడను. ఐతే నేను అర్థిజనులకు కోరిన దానిని ఇవ్వాలని వ్రతాన్నిపట్టి ఉన్నాను. అందుచేత నన్ను మహాదాతలలో ముఖ్యుడని త్రిలోకములందు కీర్తిస్తున్నారు ఇప్పుడు ఇంద్రుడు వచ్చి కోరిన దానిని నేను ఇవ్వకపోతే—నాకు అపకీర్తి కదా. అప్పుడిక బ్రతికి లాభమేమిటి? త్రిలోకాధిపతి ఐన ఇంద్రుడు అర్థిజనుడై నన్ను వచ్చికోరుట; నేను అతనికి దాతగా కోరిన దానినిచ్చుట ఇంతకంటె నాకు మహో




దయమే మున్నది? కాబట్టి మీమాట వినుట లేదను కోకండి" అన్నాడు.

సూర్యుడు "తనకు, తన పుత్రులకు, భార్యకు, జననీ జనకులకు, బంధువులకు అపకారము కలుగని విధముగా కీర్తిని సం పాదించవలెనుగాని, అందరికి సర్వనాశము అయ్యేవిధంగా కాదు, నీవు బేలవు నీవు నా భక్తుడవు కాబట్టి నీకు మేలు చేయగోరి చెప్పు తున్నాను అర్జునునితో నీకు యుద్ధము వస్తుంది. నీకు సహజ కవచకుండలములు ఉంటే అతడు నిన్ను జయించలేడు, నీవు వ్రతభంగమని ఆలోచించవద్దు. లేకపోతే ప్రాణభంగమే అవుతుంది" అని హెచ్చరిం చాడు. కర్ణుడు "దేవా! నీవు కరుణామూర్తివి నీ హితవచనములను పాటించుటలేదనినాపై. ఆగ్రహము వలదు. ధేనుదాన వ్రతాన్ని



వినర్జింపలేను. ప్రాణములు పోయినా ఫరవా లేదు పైగా అర్జునుని జయింపగల దివ్యాస్త్రములు నా దగ్గరకూడా ఉన్నాయి" అన్నాడు. సూర్యుడు "అయితే నీ యిష్టం కాని ఇంద్రునికి సహజ కవచ కుండలాలు ఇస్తూ, ఎట్లాగైనా అతని నుండి 'శక్తి' అస్త్రాన్ని సంపాదించు' అని చెప్పి అంతర్హితుడయ్యాడు.

సూర్యునికి కర్ణునిమీద వాత్సల్యం కలుగడానికి వేరొక కారణం కూడా ఉన్నది. అది అతని జన్మానికి సంబంధించినది. పూర్వము దుర్వాస మహాముని శిష్యులతో కుంతిభోజ మహారాజు దగ్గరకు వెళ్లి 'నాకు మీ యింట కొన్నాళ్లు ఉండాలని ఉన్నది. నాకు తగిన పరిచర్యలు, సౌకర్యములు చెయ్యగలవా?" అని ప్రశ్నించాడు. కుంతిభోజుడు తన కుమార్తె అయిన పృథను పిలచి దుర్వాసునకు జాగ్రత్తగా శ్రద్ధగా భక్తితో పరిచర్యలు చేయుటకు వినియోగించాడు. ఆమె భక్తి శ్రద్ధలతో సపర్యలను చేసి దుర్వాస మహామునిని మెప్పించింది ఆమె భక్తి వినయములతో కావించిన దేవోపచారములకు సంతోషపడి ఒక వరాన్ని కోరుకొమ్మనినాడు ఆమె 'మీ అనుగ్రహం లభించినది. ఇదిచాలు" అన్నది. దుర్వాసుడు "అట్లు కాదు. నీకొక మంత్రాన్ని చెప్పుతాను. దానివలన నీవు ఏ దేవుని ఆహ్వానిస్తావో అతడు వచ్చి నీ అధీనంలో ఉంటాడు" అన్నాడు. ఆమె బదులు చెప్పడానికి వెరచి ఆయన యిచ్చిన మంత్రాన్ని గ్రహించింది.

కొన్నాళ్ళకు ఆమె దుర్వాసముని ఉపదేశించిన మంత్రాన్ని పరీక్షచేయాలని ఆలోచన చేసింది. ఆ సమయమున సూర్యోదయమగుచున్నది. ఆ దివ్యమూర్తిని చూచి ఆమె ఆ దేవుని అహ్వానము చేస్తూ మంత్రోచ్చారణ చేసింది. యోగబలము చేత సూర్యుడు మూర్త్యంతరాన్ని ధరించి ఆమె దగ్గరకువచ్చి ప్రీతితో 'అబలా! నేను సూర్యుణ్ణి నీమంత్రబలంచేత నీకు ప్రీతి చెయ్యడానికి వచ్చాను. నీకు ప్రీతి ఏమిటి?' అన్నాడు. ఆమె 'నాకు కావలసిన దేమీలేదు. మంత్ర బలాన్ని పరీక్ష చెయ్యడానికి మంత్రాన్ని ఉపయోగించాను ఇక నీవు వెళ్ళవచ్చు" అన్నది. సూర్యుడు 'నీవు నన్ను పిలిచావు నేను నీ కోరిక తీర్చకుండా తిరిగి వెళ్ళరాదు నాతో సమాగమానికి అంగీకరించు, నీకు ఉత్తమ

కుమారుడు కలుగుతాడు నీవు అంగీకరించక పోతే నిన్ను, నీ జననీ జనకులను భస్మం చేస్తాను. నీకీ మంత్రాన్ని ఉపదేశించిన దుర్వాసుని నిర్దహిస్తాను." అన్నాడు కుంతీదేవి "దేవా! నేనుచేసిన తప్పును మన్నించు. నా తప్పు వలన నా చరిత్ర కళంకము కాకుండా కాపాడు." అని ప్రార్థించింది.

సూర్యుడు 'నా సమాగమము వలన నీ కన్యా వ్రతము చెడదు. నీకు అధిక తేజోవంతుడైన కుమారుడు జన్మించుతాడు నీకు లోకనింద కూడ రాదు!" అని చెప్పి ఆమెను ఒప్పించి, ఆమె సమాగమమున ప్రీతుడై ఆమెకు పుత్రోదయము కలుగునట్లుచేసి ఆకాశానికి వెళ్ళిపోయాడు. సూర్యుని అనుగ్రహమువలన కుంతీదేవికి గర్భము కలిగినట్లు ఆమె దాదికి తప్ప మరెవ్వరికీ తెలియదు. కొన్నాళ్ళకు ఒకనాటి రాత్రివేళ కుంతీదేవికి మహా తేజోవంతుడైన కుమారుడు కలిగాడు లోకాపవాద భయముచేత ఆ కుమారుణ్ణి ఒక పెట్టెలో పెట్టి దానిని ఒక తెప్పమీద కట్టి సమీపంలో ఉన్న అశ్వనదీ ప్రవాహంలో ఆమె దాది సహాయంతో వదలి పెట్టింది కన్న కుమారుణ్ణి నదిలో వదిలిపెట్టి ఆమె చాల విలాపించినది.

అశ్వనదీ ప్రవాహమున నుంచబడిన పెట్టె కొట్టుకొని చర్మణ్వతిని చేరినది. దాని నుండి యమునా నదిలోపడి దానినుండి భాగీరథిని పడి పంపానగర సమీపమును చేరినది. ఆ సమయంలో భార్యలతో అచ్చట ధృతరాష్ట్రుని స్నేహితుడైన అతిరథుడను వాడు జలకేళిలో ఉన్నాడు. అతడాపెట్టెను పట్టుకొని, ఏకాంతమున దానిని తెరచి దానిలో తేజోవంతుడైన కుమారుణ్ణి చూచాడు. ఆ బాలుడు సహజమైన బంగారు కవచంతో, బంగారు కుండలాలతో ఉన్నాడు. ఆ బాలుణ్ణి ఎత్తికొని అతిరథుడు తన భార్యయైన రాధ కిచ్చినాడు. ఆ బాలుడు దేవతాసంభవుడని వారు గ్రహించారు. ఆమె ఆ బాలుని ఎత్తుకొనగా ఆశ్చర్యకరంగా ఆమెకు చనుబాలు వచ్చినవి.

(ఇంకా వుంది)



# కష్టే ఫలి

అనగా అనగా ఒక రాజ్యం. ఆ రాజ్యంలో ప్రజలందరూ చాలా సోమరులు ఆ రాజ్యాన్ని పరిపాలిస్తున్న రాజు చాలా తెలివైనవాడు. సోమరులై వర్తించుచున్న తన ప్రజలకు గుణపాఠం నేర్పాలని తలచి, ఆ రాత్రి ముఖ్యమైన రహదారి మధ్య మార్గమున ఓ పెద్ద బండను పడవేయించాడు మరునాడు తాను మారు వేషంలో ప్రజలయొక్క చర్యలు పరిశీలించుటకై, ఆ ప్రాంతంలో తన అనుచరులతో తిరుగ సాగాడు. కొంతమంది వర్తకులు ఆ మార్గమునకు వచ్చి అక్కడున్న రాతిబండను చూచి గూడా దానిని తొలగించకయే చుట్టు తిరిగి పోయారు. అట్లే ఓ ఉన్నతోద్యోగి తన వాహనముపై వచ్చాడు అతడు కూడ ఆ రాతిని గురించి ఆలోచించక, దాని ప్రక్కనుంచె వెళ్ళాడు. అ తరువాత ఒక సైనికుడు తన గుర్రంపై వచ్చాడు. అతడూ అట్లే రాతిని చుట్టు తిరిగి పోయాడు గానీ దానిని తొలగించు ప్రయత్నమేమీ చేయలేదు.



ఆ ప్రాంతంలో తిరుగుచున్న ప్రజలుకూడా దానిని పట్టించుకొనక తప్పించుకొని తిరుగాడ సాగారు. అంతే కాక పైపెచ్చు అక్కడ అడ్డంగా నున్న రాతిని, దానిని తొలగించని రాజు ...ఖంన నడుచుకొని సాగారు. అలా వంద రోజులు గడిచాయి. ఎవ్వరూ ఆ రాతిబండను తొలగించు ప్రయత్నం చేయలేదు. ఇదంతా గమనించుచున్న రాజు కొంతమంది తన అనుచరులను తన వెంట దీసుకొని దానిని తొలగించగా, ఆ రాతిబండ క్రింద ఒక ఇనుప పెట్టె దొరికింది దానిపై "ఈ రాతిని తొలగించినవాడు దీని అడుగున గల బంగారు నాణెముల పెట్టెకు హక్కుదారగును" అని వ్రాసి వుంది. మారు వేషంలోనున్న రాజును గుర్తించని ప్రజలు, రాజు ఎదుటనే "అం మనకెందుకు, పన్నులు తీసుకుంటున్న రాజేమి చేయుచున్నాడు ?" అని విమర్శిస్తూ మాట్లాడుకుంటున్నవారు, ఒక్కసారిగా ఆ నాణెముల పెట్టెను చూచి ఆశ్చర్యపోయి 'అయ్యో! మనము సోమరులమై దీనిని తొలగించు ప్రయత్నము చేయనందువల్ల మనకా భాగ్యం దక్కలేదని" విచారించ సాగారు. రాజు తన మారు వేషమును తీసివేసి సోమరులై వింత చూడ వచ్చిన ప్రజలను వుద్దేశించి కష్టంచేస్తే తప్పక ఫలితం కలుగుతుంది సోమరులకు ధన ధాన్యములు ఎల్లప్పుడూ దూరంగానే వుంటాయి" అని అన్నాడు.

రాజును గమనించిన పురప్రజలు రాజే తమకు బుద్ధి చెప్పుటకు ఇట్లు చేసెనని గ్రహించి సిగ్గుతో తలలు వంచుకొన్నారు.